# చైర్మన్‌తో ముఖాముఖి



**ప్ర: తాగునీటికే తీవ్ర కరువు పొంచివున్న పరిస్థితులలో ఎక్కువ నీరు అవసరం అయ్యే వరి, గోధుమ పంటలు పండించడం ఎంతవరకూ సబలు. అంతరపంటలయిన చిరుధాన్యాలు, తృణ ధాన్యాల పంటలపై రైతులు దృష్టిపెడితే బాగుంటుంది. వీటికి అవసరం అయ్యే నీరు కూడా తక్కువే. ప్రభుత్వం ఆ దిశగా ఎందుకు ప్రయత్నించడంలేదు. రైతులకు అవగాహన కల్పించడం లేదు?**

**-ఎ.నరసింహరాజు, భీమవరం**

జ: హరిత విప్లవం తర్వాత వరి ఉత్పాదన భారీఎత్తున పెరిగింది. అయితే చిరుధాన్యాలు, తృణధాన్యాల సాగు మాత్రం దారుణంగా తగ్గిపోయింది. ఎక్కువగా వరి, గోధుమ పంటలు పండించడం వలన నీటి అవసరం బాగా పెరిగిపోయింది. గతంలో మధ్యప్రదేశ్‌లో గోధుమకు బదులుగా బార్లీ పంటను ప్రోత్సహించేందుకు గట్టి ప్రయత్నమే జరిగింది. గోధుమ పంట దిగుబడికి వచ్చేలోపు ఆరుసార్లు నీరుపెట్టాలి, బార్లీకి మూడుసార్లు పెడితే సరిపోతుంది. ప్రభుత్వాలు మద్దతు ధరతో ధాన్యాన్ని సేకరిస్తుండటం, కొన్ని పంటలకే మద్దతు ధరలుండటం వంటి విధానాల వల్ల తేలికగా పంట పద్ధతులు మార్చుకునే వీలుండటం లేదు. ఈ నేపథ్యంలో రైతులు వరిని వదిలిపెట్టి తృణ, చిరు ధాన్యాల పంటలు సాగుచేయాలంటే వాటికి కూడా మద్దతు ధర కల్పించాల్సిన అవసరం ఉంటుంది. మిగతా పంటల విషయంలో కూడా సాగు పరిస్థితులను మెరుగుపరచాల్సిన అవసరం ఉన్నా డిమాండ్ ఎక్కువగా ఉన్నందున ముందుగా వరి విషయంలో తక్షణమే దిద్దుబాటు చర్యలు ఆరంభించాలని పంటల నిపుణులు అభిప్రాయపడుతున్నారు. పరిస్థితులను బట్టి నీటి అవసరం అంతగా ఉండని డ్రై సీడింగ్ వంటి వరి సాగు పద్ధతులకు మళ్లటం, సాగునీటి అవసరాల కోసం చెరువులు, కుంటల వంటి ఉపరితల నీటి వనరుల మీదే ఆధారపడుతూ కేవలం కరవులు, క్షామాల్లోనే భూగర్భ జలాలను ఆశ్రయించటం అవసరమని ఆహార పంటల నిపుణులు సిఫార్సు చేస్తున్నారు. పంట పద్ధతులను మార్చుకోవటమన్నది ఎన్నో సామాజిక, రాజకీయ, ప్రభుత్వ విధానాలతో ముడిపడినందున ఇప్పటికిప్పుడే పరిస్థితి మారిపోకపోవచ్చుగానీ భూగర్భం ఖాళీ అయిపోతూ నీటి కరవు కమ్ముకొస్తున్న నేపథ్యంలో దీనికి అట్టే సమయం లేదని మాత్రం గుర్తించక తప్పదు.

**ప్ర: ఉత్తరప్రదేశ్ రాజకీయాలు రోజురోజుకూ గాడితప్పుతున్నాయి. వచ్చే సంవత్సరం జరగబోయే ఎన్నికలు అధికారపక్షానికి చెమట్లు పట్టిస్తున్నాయి. ఈ స్థితిలో కుటుంబ కలహాలు పరిపాలనను మరింత జఠిలం చేస్తున్నాయి. వచ్చే ఎన్నికలలో ఈ ప్రభావం అధికారపక్షంపై ఏ మేరకు ఉండనుంది? ప్రతిపక్షాలకు ఛాన్స్ ఇచ్చినట్లేనా?**

**-వి.హేమంత్, తెనాలి**

జ: ములాయంసింగ్ యాదవ్ కుటుంబం ప్రస్తుత వివాదాన్ని సత్వరం పరిష్కరించుకొనకపోతే పరిస్థితి పూర్తిగా చేజారుతుంది. ఆ పార్టీ కోలుకోలేని విధంగా దెబ్బతింటుంది. తాత్కాలికంగా సద్దుబాటు చేసుకొన్నా, సమస్య నీడలా వెన్నాడుతూనే ఉంటుంది. స్థితిగతులు ఇదివరకటివలె మాత్రం ఉండవు. అసలు ఈ సమస్యను ములాయం కుటుంబం ఏవిధంగా పరిష్కరించుకొంటుందన్నదే అంతుపట్టడంలేదు. అంతా తమదే పైచేయి కావాలనుకొనే వారే. ఒక అడుగు దిగిరావడానికి ఎవ్వరూ సిద్ధంగా లేరు. ఒకవేళ ఆ కుటుంబం... దాంతో పాటు పార్టీ విచ్ఛిన్నమైతే మరింత అస్థిరత ఏర్పడుతుంది. ఓట్లు సంపాదించిపెట్టగల జనాకర్షణశక్తి ఆ పార్టీలో ములాయం ఒక్కరికే ఉంది. రాజకీయాలకు సంబంధించినంతవరకు చరమదశలో ఉన్న ములాయమే ఈ పార్టీకి నేటికీ జీవశక్తి. పార్టీ ఆయనమీదే పూర్తిగా ఆశలు పెట్టుకొంది. శివపాల్ యాదవ్, ములాయం నీడలాంటి వ్యక్తి. సొంత వ్యక్తిత్వం కలిగిన నాయకుడు కాదు. అఖిలేశ్ ఇంకా ఎదగలేదు. అట్టడుగుస్థాయిలో సంబంధాలు ఏర్పరచు కోలేదు. వివిధ అంశాల లోతుపాతులు పెద్దగా తెలీవు. ఆయన తీసుకొన్న కొన్ని నిర్ణయాలను రాబోయే ప్రభుత్వం తిరగదోడవచ్చు. రాష్ట్ర సర్కారు ఏటా ప్రదానంచేసే యశ భారతి అవార్డు కింద విజేతకు రూ.11 లక్షల నగదు బహుమతి ఇస్తారు. అలాంటి బహుమతి గ్రహీతలకు నెలవారీ రూ.50,000 పింఛను ఇస్తోంది అఖిలేశ్ ప్రభుత్వం. ప్రపంచంలో ఎక్కడ కనీ వినీ ఎరుగని విడ్డూరమిది. ప్రజాధనాన్ని ఈ విధంగా ఆయన విచ్చలవిడిగా ఖర్చుచేసేస్తున్నారు. అఖిలేశ్ నేతృత్వంలో పాలన అదుపు తప్పిందన్న భావన ఇప్పటికే ప్రజల్లో బలంగా నాటుకుపోయింది. ఈ నేపథ్యంలో కుటుంబంలో రాజకీయ కుమ్ములాటలు విపక్షాలకు అనుకోని వరంగా కలిసివచ్చే అవకాశం కనిపిస్తోంది. ప్రస్తుత కుమ్ము లాటలు సమాజ్‌వాదీ పార్టీకి తీవ్ర నష్టం కలిగించాయి. తగా దాను పరిష్కరించుకొనకుండా ఇలాగే ఎన్నికలకు వెళితే, ఆ పార్టీ దెబ్బతినడం ఖాయం. భూస్వామ్య తరహా ఆనువంశిక రాజకీయం అంతానికి అది ఆరంభం కావచ్చు. ఆనువంశిక రాజకీయాలు చేస్తున్న అన్ని కుటుంబాలకు ఇదొక హెచ్చరిక, గుణపాఠం. భారత రాజకీయాల్ని పట్టిపీడిస్తూ, ప్రజాస్వామ్యాన్నే హాస్యాస్పదంగా మార్చేస్తున్న పెనురుగ్మతకు ఈ పరిణామం తగిన చికిత్సగా ఉపయోగపడవచ్చు.

**నూకారపు సూర్యప్రకాశరావు**
**చైర్మన్, సూర్య తెలుగు దిన పత్రిక**

మెయిల్ అడ్రస్
SPR publications, Surya Soudha, Plot.No: 185,
M.C.H. NO.258/1/185, siddi vinayaka nagar,
Chandanayak Thanda, Madhapur, Opp: Hi-Tech City, Hyderabad - 500 072

లెజెండ్

# ఆధునిక కుట్టు మిషన్ ఆరాధ్యుడు ఐజాక్ సింగర్



ఐజాక్ సింగర్ అమెరికాలోని న్యూయార్క్ రాష్ట్రంలోని పీట్స్ టవున్ అనే ఊళ్ళో 1811 అక్టోబర్ 27న రూత్ బెన్సన్, ఆడమ్ సింగర్ అనే జర్మనీ నుంచి వలస వచ్చిన యూద దంపతులకు ఆఖరి బిడ్డగా జన్మించాడు. ఈయనకు ముగ్గురు భార్యలు, 18 మంది సంతానం. సింగర్ కనిపెట్టిన వాటిలో రాళ్ళకు రంధ్రాలు వేసే మర రంపపు కోత మిషన్, కుట్టుమిషన్ ప్రధానమైనవి. అంతకుముందు కుట్టుమిషన్ కనుగొన్నవారున్నా అనువైన మిషన్ కనుగొన్నది సింగరే. 1830లో మొట్టమొదట ఆర్మీ యూనిఫాంను కుట్టారు.

**దుస్తుల తయారీతో ప్రజలకు చేరువ:**
అప్పటి వరకు ఎంతోమంది తయారు చేసిన కుట్టుమిషన్లు పరోక్షంగా ఉపయోగపడేవి. బెడ్ షీట్లు, బ్యాగులు కవర్ల వినియోగాని కి మాత్రమే పనికి వచ్చేవి. 1840లో సింగర్ తయారు చేసిన మిషను ప్రపంచ వ్యాప్తంగా ఆదరణ పొంది దుస్తుల తయారీకి ఎంతో ఉపయోగపడుతోంది.

**సామాన్య కుటుంబం నుంచి:** సింగర్ అక్టోబర్ 27, 1811న న్యూయార్క్ రాష్ట్రంలోని పిట్స్ టౌన్లో జన్మించాడు. ఐజాక్ ఎనిమిది మంది సంతానంలో చివరివాడు. ఈయన తండ్రి ఆడమ్ సింగర్ జర్మనీకి చెందిన యూదు మతస్థుల సంతతని నమ్మకం. ఆయన స్వస్థలమైన ఫ్రాంక్ ఫర్టులో హంగేరీ నుండి వలసవచ్చిన రెయిజింగర్ అనే కుటుంబం ఉండేది. ఐజాక్ చిన్నతనం నుండి యంత్రాలు, నాటకాలపై ఆసక్తి పెంచుకు న్నాడు. 12వ యేట ఇల్లు వదిలి చిన్నా చితకా ఉద్యోగాలు చేస్తూ జీవనం సాగించాడు. 19 యేళ్ల వయసులోను సహాయ యాంత్రికుడుగా పని ప్రారం భించాడు. 1830లో ఐజాక్ 19 యేళ్ళ వయసులోనే పాల్మైరాకు చెందిన కాథరీన్ మరియా హేలీని పెళ్ళిచేసుకొ న్నాడు. అప్పటికి ఆమె వయసు పదిహేనే. అత్త మామలతో పాటు కొన్నాళ్లు వెస్ట్‌చెస్టర్ కౌంటీలోని క్రోటన్స్ లాండింగ్లో నివసించాడు. 1834కల్లా ఐజాక్ కు ఒక కొడుకు (విలి యం) పుట్టాడు మరియు పోర్ట్ గిబ్సన్లో ఒక సొంత ఇళ్ళు కొనుకున్నాడు. పగలు వివిధ పనులు చేస్తూ, రాత్రిళ్ళు నాటకాలు వేసేవాడు. 1836 కల్లా కుటుం బంతో పాటు న్యూయార్క్ నగరంలో నివసించడం ప్రారంభిం చాడు.

**మొదటి ఆవిష్కరణలు:** 1839 లో సింగర్ రాళ్ళను డ్రిల్లింగ్ చేసే యంత్రాన్ని కనిపెట్టి దానిపై పేటెంటును పొందాడు. ఈ పేటెంటు హక్కును ఇల్లినాయ్ మిషిగన్ కెనాల్ కంపెనీకి రెండువేల డాలర్లకు అమ్మాడు. అలా సమకూరిన డబ్బుతో తన నట జీవితాన్ని తిరిగి కొనసాగించాలని అనుకున్నాడు. ఆయన తన ఆశయం కోసం ఆయన ఒక నట వర్గాన్ని ప్రోగుచేసుకొని దేశమంతా పర్యటన ప్రారంభించాడు. ఈ బృందానికి మెరిట్ ప్లేయర్స్ అనే పేరుపెట్టాడు. బృందం యొక్క ప్రదర్శనలలో సింగర్ ఐజాక్ మెరిట్ అనే పేరుతో పాల్గొనేవాడు. ఈయన సరసన ఆ బృందంలో మేరీ అన్న్ మిసెస్ మెరిట్‌గా ప్రదర్శనలిచ్చేది. అలా ఆ బృందం యొక్క ప్రదర్శనా పర్యటన ఐదు సంవత్సరాల పాటు కొనసాగింది.

**పేటెంట్ రైట్స్:**
సింగర్ చెక్కను మరియు లోహాన్ని తొలిచే యంత్రాన్ని అభివృద్ధి చేసి ఏప్రిల్ 10, 1849 న దానిపై పేటెంటును నమోదుచేశాడు. 38 వ సంవత్సరంలో ఆయన మేరీ అన్న్ మరియు ఎనిమిదిమంది పిల్లలతో న్యూయార్క్ నగరానికి తిరిగి వచ్చాడు. అచట ఆయన చెక్క బల్లలను కోసే యంత్రాన్ని మార్కెట్ లోకి విడుదల చేయాలనుకున్నాడు. పూర్తిస్థాయిలో పనిచేసే నమూనా యంత్రాన్ని తయారుచేసేందుకు ఎ.బి.టైలర్ అండ్ కో వద్ద అడ్వాన్సును పుచ్చుకొని వాళ్ళ షాపులోనే ఒక నమూనా యంత్రాన్ని నిర్మించాడు. అక్కడే తన భవిష్యత్తు ఆర్థిక భాగస్వామి, పెట్టుబడిదారుడు జి.బి.జీబర్‌ను కలుసుకున్నాడు. అయితే నమూనా యంత్రం తయారైన కొంతకాలానికే ఆ షాపులో ఆవిరి బాయిలర్ పేలి, నమూనా యంత్రాన్ని కూడా నాశనం చేసింది. జీబెర్ బోస్టన్ (ప్రింటింగ్ ట్రేడ్ కేంద్రం) లో తిరిగి కొనసాగించేందుకు సింగర్‌ను ఒప్పించాడు. 1850 లో సింగర్ బోస్టన్ వెళ్ళి తన ఆవిష్కరణను ఆర్సన్ సి.ఫెలిప్స్ షాపులో ప్రదర్శించాడు. అయితే సింగర్ చెక్క కోసే యంత్రానికి మాత్రం పెద్దగా ఆర్డర్లు లేవు.

ఫెలిఫ్స్ షాపులో లెరో అండ్ బ్లాడ్గెట్ (కుట్టు మిషన్లు) యంత్రాలు తయారీ మరియు రిపైర్ చేయబడుతుండేవి. ఫెలిప్స్ తయారీకి క్లిష్టంగా ఉన్న తయారీ మరియు ఉపయోగాలు గల ఆ యంత్రాలను చూచి సరిచేయాలని చెప్పాడు. సింగర్ ఆ యంత్రంలో వృత్తాకార మార్గంలో కాకుండా సరళరేఖలో షటిల్ చలించేటట్లు చేసి, సూదిని వక్రంగా కాకుండా సరళరేఖలో పోవునట్లు చేయడం వలన సులువుగా కుట్టవచ్చని నిర్ధారించాడు. సింగర్ ఆగష్టు 12, 1851 లో యునైటెడ్ స్టేట్స్ నుండి 8294 సంఖ్యగల పేటెంట్ హక్కును పొందాడు.

సింగర్ రూపొందించిన నమూనా ప్రయోగాత్మకంగా దుస్తులు కుట్టుటకు మొదటి యంత్రంగా ప్రసిద్ధి చెందినది. ఈ యంత్రం ఒక నిమిషంలో 900 కుట్లను వేయగలదు. ఈ యంత్రంతో సులువుగా పరిపూర్ణ దుస్తులు కుట్టవచ్చు.



రచయితలను ఎప్పుడూ రెండు బలీయమైన శక్తులు ఆవరించుకకకుని ఉంటాయి. అవి నూతన విషయాలు అందరికీ తెలిసేలా చెప్పగలగడం, అందరికీ తెలిసిన విషయాలే కొత్తగా చెప్పగలగడం -జాన్సన్

# కొన్ని అపజయాలొచ్చినంత మాత్రాన...

అడగకముందే అందరికీ దొరుకుతోంది...
నేనడిగినా... అడుక్కున్నా కూడా...
ఏదీ అందకుండా పోతోంది...
కష్టపడకుండా ఏదీ రాదని తెలుసు...
కానీ నా కణకణం కాలి బూడిదవుతున్నా...
కన్నీరే మిగిలి...
అవుతున్నా మీ అందరికీ అలుసు...

నేస్తాల్లారా..!!
తప్పు నాది కాదని మీలో తెలిసేది ఎందరికని..??
తప్పులెంచి తలతిప్పుకు పోతారెందుకని..??
అపశకునాలని నాకు అంటగట్టి అంటరానివాడినంటారా..??
అదృష్టహీనుడని నను హేళన చేసి అవమానపరుస్తారా..??
స్నేహం చేయడం, నమ్మకంగా మెలగడమే నా తప్పా..??
నావాళ్ళుగా మిమ్మల్ని భావించడమే నే కొనితెచ్చుకున్న
ముప్పా..??

కొన్ని అపజయాలొచ్చినంత మాత్రాన మనిషి
వ్యర్థమవుతాడా..??
కొన్ని విజయాలతోనే ఈ జగాన్నంత యేలేస్తాడా..??
ఎందుకు మీ మూర్ఖత్వాన్ని ప్రదర్శించి చరిత్ర
హీనులవుతారు..??
ఎందుకు మీ అమాయకత్వంతో అందరికీ లోకువ
అవుతారు..??
ఈరోజు కాకపోయినా రేపైనా నా ప్రతిభ వెలుగులోకి
రాదా..??
పశ్చాత్తాపంతో మీరంతా తలదించుకునే రోజు రాదా..??

– బొడ్డు మహేందర్

# రన్నింగ్ వాయిస్



### పజిల్స్ పెంచాలి

ఈ వారం వింతలు విశేషాలు ఎంతగానో బాగున్నాయి. వాస్తు సమాధానాలు సంతృప్తికరంగా ఉంటున్నాయి. న్యూమరాలజీ ద్వారా సమస్యలను పరిష్కరించుకుంటున్నాము. చక్కని శీర్షికను ఇలాగే కొనసాగించండి. పిల్లల పేజీలు పెంచితే బాగుంటుంది. ఎక్కువగా పజిల్స్ ఇస్తే మరింత బాగుంటుంది.

–హేమంత్, మౌలాలి

### కలర్ పేజీలు

కవర్ పేజీ కథనం సందర్భోచితంగా ఉంటోంది. పబ్లిక్‌ను ఇన్‌వాల్వ్ చేసే శీర్షి ఎకలు ఇస్తే బాగుంటుంది. అలాగే పాఠకుల అనుభవాలతో కూడిన ఓ శీర్షిక నిర్వహించండి. యూత్‌ను ఎంకరేజ్ చేసే శీర్షికలు, ఆడవారికి నచ్చే ఐటమ్స్ అన్నీ కవర్ అయితే సండే మరింత జనరంజకంగా ఉంటుంది. అన్నీ కలర్ పేజీలలో ఉండేలా చూడండి.

**వింతలు విశేషాలు**

ఈ వారం వింతలు విశేషాలు ఎంతగానో బాగున్నాయి. వాస్తు సమాధానాలు సంతృప్తికరంగా ఉంటున్నాయి. న్యూమరాలజీ ద్వారా సమస్యలను పరిష్కరించుకుంటున్నాము. చక్కని శీర్షికను ఇలాగే కొనసాగించండి. పిల్లల పేజీలు పెంచితే బాగుంటుంది. ఎక్కువగా పజిల్స్ ఇస్తే మరింత బాగుంటుంది.

## 'కూని'రాగాలు

**ప్రయత్నంలో ప్రతిఫలం కోరుకోవాలి..!**
**ఏకాంతంలో ప్రశాంతత వెతుక్కోవాలి..!!**

**వివాదం పరిష్కారానికి అనుకూలమే..!**
**వితండం కలహాలకు ముందువరస..!!**

**సందర్భం అర్థంకాకుంటే మిన్నకుండాలి..!**
**సమయం అనుకూలించకుంటే వేచియుండాలి..!!**

**అందుబాటులో ఉన్నపుడే అందుకోవాలి..!**
**ఆపదలో ఉన్నపుడు సంయమనం పాటించాలి..!!**

**గెలుపులో సాగుతుంటే అణుకువగా వుండాలి..!**
**ఓటమి ఖరారైనపుడు ఆహ్వానించగలగాలి..!!**

- కూనిరెడ్డి శ్రీనివాస్

### ప్రేమించట్లేదేమో?

**శ్రీరాం:** 'లలిత నన్ను ప్రేమించడం లేదనిపి స్తుందిరా!
**ఉపేంద్ర:** ఏం...అలా అని చెప్పిందా?
**శ్రీరాం:** ఆవేశంలో ఉన్నపుడు నీకోసం కొండమీద నుండి దూకమన్నా దూకుతాను, సముద్రంలో ఈదమన్నా ఈదుతాను అంటే ఆ పనులన్నీ చేసి చూపించమంది

### లంచం మహిమ

**తరుణ్:** లంచం తీసుకున్నందుకు నీ ఉద్యోగం పోయింది కదా. మళ్లీ ఆ ఉద్యోగంలోనే ఎలా చేరగలిగావ్?

**పవన్:** ఘనంగా లంచం ఇచ్చి.

### ఏ పశువు కొడుకును

నాని: ఎందుకు ఏడుస్తున్నావు?
**బుజ్జి:** నాన్న అమ్మని "పనికిమాలిన దరిద్రపు పీనుగ" అని తిట్టాడు. అమ్మ నాన్నని "బుద్ధిలేని అడ్డగాడిద" అని తిట్టింది. **నాని:** మరి నువ్వెందుకు ఏడుస్తున్నావు?
**బుజ్జి:** మధ్యలో నేనెవరినో తెలియక ఏడుస్తున్నాను.

ఫన్ చ్









నారు






మైఖేల్ క్రింక్టన్ రచించిన జురాసిక్ పార్క్ నవల ఆధారంగా స్టీవెన్ స్పీల్బర్గ్ అదే పేరుతో 1993లో సైన్సు ఫిక్షన్ సినిమా తీశారు. ఈ చిత్రం కథ ఇస్లా నబ్లార్ అనే ద్వీపం చుట్టూ తిరుగుతుంది. ఈ ద్వీపంలో శాస్త్రవేత్తలు విజ్ఞానాత్మక మరియు వినోదాత్మక పార్కును నిర్మిస్తారు. అందులో వైజ్ఞానిక శాస్త్రం ద్వారా పుట్టించిన రాక్షస బల్లులు ఉంటాయి. జాన్ హమ్మండ్ (రిచర్డ్ అటెంబరో) కొంతమంది శాస్త్రవేత్తలను పార్కును సందర్శించటానికి పిలుస్తాడు. శాస్త్రవేత్తలుగా సామ్ నీల్, లారా డర్న్ తదితరులు నటించారు. విచ్చలవిడిగా రాక్షస బల్లులను వదలడంతో సాంకేతిక నిపుణులు మరియు సందర్శకులు ద్వీపం నుండి పారిపోవటానికి ప్రయత్నించారు.

# జురాసిక్ పార్క్

చిత్ర నిర్మాణం నవల ప్రచురణకు ముందే మొదలయ్యింది. నవలలో ప్రస్థావించిన కథను బాగా తగ్గించి సినిమాకు అనుగుణంగా స్క్రిప్ట్ రాయటానికి క్రింక్టన్‌ను నియమించారు. స్పీల్‌బర్గ్ స్టాన్ విన్స్టన్ స్టూడియోస్ యొక్క తోలు బొమ్మలను అద్దెకు తీసుకొని ఇండస్ట్రియల్ లైట్ మ్యాజిక్ సహాయంతో రాక్షస బల్లులను చిత్రీకరించడానికి కట్టింగ్ ఎడ్జ్‌ను అభివృద్ధి చేశారు. పాత్ర స్వభావాన్ని విమర్శిన్చినప్పటికి, విమర్శకులు జురాసిక్ పార్క్ చిత్రాన్ని ఆమోదించారు. ఈ చిత్రం విడుదలైనప్పుడు 914 మిలియన్ డాలర్ల అత్యధిక వసూళ్లు నమోదు చేసి అంతవరకు వచ్చిన అన్ని చిత్రాలకంటే విజయవంతమైనదిగా నిలిచింది. ఇప్పటికీ ఈ చిత్రం






అత్యధిక వసూళ్లు చేసిన 14వ చిత్రంగా ఉంది. ముఖ్యంగా సీజీఐను స్పెషల్ ఎఫెక్ట్స్ కోసం ఉపయోగించే చిత్రాలకు మార్గదర్శకంగా నిలిచింది. ఈ చిత్రానికి కొనసాగింపుగా 1997 లో ది లాస్ట్ వరల్డ్ జురాసిక్ పార్క్ : , 2001 లో జురాసిక్ పార్క్ 3 మరియు డెవలప్‌మెంట్ హెల్‌లో ఉన్న జురాసిక్ పార్క్ వచ్చాయి.

**ది లాస్ట్ వరల్డ్: జురాసిక్ పార్క్:**

1997లో వచ్చిన సైన్స్ ఫిక్షన్ సినిమా ఇది. మైఖేల్ క్రింక్టన్ ఇదే పేరుతో రచించిన నవల ఆధారంగా స్టీవెన్ స్పీల్‌బర్గ్ దర్శకత్వం వహించిన జురాసిక్ పార్క్ సినిమాకు ఇది కొనసాగింపు. మొదటి సినిమా విజయం తరువాత అభిమానులు మరియు విమర్శకులు కొనసాగింపు నవలకై మైఖేల్ క్రింక్టన్‌పై ఒత్తిడి తెచ్చారు. గతంలో ఇటువంటి కొనసాగింపు నవల రాసిన అనుభవం లేకపోవడంతో క్రింక్టన్ ముందు ఒప్పుకోలేదు. కానీ స్టీవెన్ స్పీల్‌బర్గ్ బలవంతంతో క్రింక్టన్ కొనసాగింపు నవలను ప్రకటించాడు. ఆ నవల ప్రచురణ అయిన వెంటనే, ఒక చలనచిత్ర నిర్మాణం చేపట్టారు. ఈ చలనచిత్రాన్ని 1997 మధ్యలో విడుదల చేయాలనుకున్నారు. విడుదలైన తరువాత ఆ చిత్రం వాణిజ్య పరంగా విజయవంతమైన చిత్రంగా నిలిచి, ఎన్నో బాక్స్ ఆఫీసు రికార్డులను తిరగరాసింది. ఈ చిత్రం మిశ్రమ విమర్శలను అందుకుంది. దీని ముందు వచ్చిన సినిమాల లాగ పాత్ర స్వభావం గురించిన విమర్శలు ఎదుర్కొంది. ఈ చిత్రం క్రింక్టన్ యొక్క నవల ఆధారితంగానే తీసినప్పటికీ, కేవలం ఒకే సన్నివేశాన్ని నవల నుంచి తీసుకొని సినిమాలో వాడుకున్నారు.

ఈ చిత్రంలో కథ ఇస్లా సొర్న అనే ద్వీపం చుట్టూ తిరుగుతుంది. రాక్షసబల్లులు ఆక్రమించి, నివసిస్తున్న అడవి ఉన్న ప్రధాన జురాసిక్ పార్క్ ద్వీపానికి ఇది అనుబంధంగా ఉంటుంది. ఇయాన్ మాల్కం బృందం రాక్షసబల్లులను వాటి నివాస స్థలంలో చిత్రీకరించి డాక్యుమెంటరీ తాయారు చేయడానికి బయలుదేరుతారు. కాగా, ఇంజెన్ బృందం రాక్షసబల్లులను వల పన్ని పట్టుకొని సాన్ డిగోలో రెండవ జురాసిక్ పార్క్ నిర్మించాలనుకుంటారు.

ది లాస్ట్ వరల్డ్ చిత్రం ముగిసిన తరువాత స్టీవెన్ స్పీల్‌బర్గ్ తను మరోసారి జురాసిక్ పార్క్ చిత్రం గురించి పని చేయనని ప్రకటించారు. కొన్ని సంవత్సరాల తరువాత, జో జాన్స్టన్ జురాసిక్ పార్క్ నిర్మాణం చేపట్టారు.

**జురాసిక్ పార్క్ :**

జురాసిక్ పార్క్ 2001లో విడుదలైన సైన్సు ఫిక్షన్ చిత్రం, పైగా ఇది లాస్ట్ వరల్డ్ జురాసిక్ పార్క్‌కు కొనసాగింపు. మైఖేల్ క్రిస్టన్ రాసిన నవల ఆధారం కాకుండా మరియు స్టీవెన్ స్పీల్బర్గ్ దర్శకత్వం వహించని జురాసిక్ పార్క్ చిత్రాలలో ఈ చిత్రం మొదటిది. నిజానికి, మూడవ జురాసిక్ పార్క్ చిత్రం జురాసిక్ పార్క్: ఎక్స్‌టెన్షన్ 14 పేరుతో నిర్మించబడింది. ఈ చిత్రానికి ప్రాణాంతకమైన వ్యాధితో రెండు ద్వీపాల్లోని రాక్షసబల్లులు అంతరించిపోవడం అనే స్క్రిప్ట్‌ను అనుకున్నారు. స్క్రిప్టులో చాలా రకాలుగా మార్పులు చేసిన తరువాత, యూనివర్సల్ ఆ స్క్రిప్టును తిరస్కరించి, ప్రస్తుతం సినిమాలో ఉన్న స్క్రిప్టును ఎంచుకొని దానికి జురాసిక్ పార్క్ అని పేరు పెట్టింది. తిరస్కరించిన స్క్రిప్టును జురాసిక్ పార్క్ కోసం వాడదలిచారు.

జో జాన్స్టన్ జురాసిక్ పార్క్ యొక్క కొనసాగింపు చిత్రానికి దర్శకత్వం వహించడానికి ఆసక్తి కనబరిచి, తన స్నేహితుడైన స్టీవెన్ స్పీల్బర్గ్ ను సంప్రదించాడు. స్పీల్బర్గ్ జురాసిక్ పార్క్ యొక్క మొదటి కొనసాగింపు చిత్రానికి దర్శకత్వం వహించడానికి ఆసక్తి తెలిపారు. ఈ ధారావాహికలో మూడవ చిత్రాన్ని కూడా నిర్మిస్తే, ఆ చిత్రానికి జాన్స్టన్ దర్శకత్వం వహించేందుకు స్పీల్బర్గ్ ఒప్పుకున్నారు. అయినప్పటికీ, స్పీల్బర్గ్ ఈ మూడవ కొనసాగింపు చిత్రానికి ఎక్సిక్యూటివ్ ప్రొడ్యూసరుగా పని చేసి చిత్ర నిర్మాణంలో పాల్గొన్నారు. కాలిఫోర్నియా, ఓహు మరియు మోలోకాయ్‌లలో చిత్రీకరణతో ఈ సినిమా యొక్క నిర్మాణం 30 ఆగస్ట్, 2009న మొదల య్యింది. ఈ చిత్రం ఒక మోస్తరుగా విజయం సాధించి విమర్శకుల నుండి మిశ్రమ అభిప్రా యాలను అందుకుంది. ఇంతకుముందు వచ్చిన చిత్రాల కంటే ఈ మూడవ చిత్రం బాగుందా లేక అసలు బాగాలేదా అనే విషయమై భిన్నాభిప్రా యాలు వచ్చాయి. ఈ చిత్రం మరోసారి పాత్రపరంగా విమర్శలను ఎదుర్కొంది.

రెండవ సినిమాలో ఉన్న ఏ పాత్రా ఇందులో కనిపించదు. అయితే మొదటి సినిమాలో నటించిన శాంనీల్ మరియు లారా డార్న్ ఇందులో నటించారు. ఇయాన్ మాల్కం మరియు జాన్ హామ్మండ్ గురించి ప్రస్తావించడం జరిగింది. రెండవ చిత్రంలో చూపించిన ఇస్లా సొర్నా అనే ద్వీపాన్ని ఇందులో కూడా చూపించారు. ఈ చిత్రంలో ఒక జంట డా.ఎలాన్ గ్రాంట్‌ను తమ పర్యాటక మార్గదర్శకుడిగా నియమించుకున్నారు (నిజానికి వీరు అతనిని తమ కొడుకైన ఎరిక్ ను కాపాడటానికి నియమించుకున్నారు). కాని వాళ్ళ లోహ విహంగము ద్వీపంపై కూలిపోవడంతో బ్రతికి బయట పడినా వాళ్ళు ద్వీపం నుండి పారిపోవుటకు ప్రయత్నిస్తుండగా స్పైనాసరస్ మరియు వెలోసిరాప్టర్స్ వెంటబడి తరిమాయి.







అడగకుండా ఇచ్చేది నిజమైన దానం, పాపపు పనుల నుంచి మళ్ళించేవాడు స్నేహితుడు, మంచి స్వభావమే మనిషికి అలంకారం. -సుభాషిత రత్నావళి

# బతుకుపాటకు చిందు నేర్పిన చిందు నేర్పిన అందెశ్రీ



**అతడిది జిల్లా వరంగల్లు, మండలం మద్దూరు, ఊరు రేబర్తి. అంటరానింటిలో అంటరానివానిగానే పుట్టాడు. పాడితే కంఠనాళం తెగి పడాలి. పల్లవితో అంటుకునే అగ్ని కావాలి. అంతిమ చరణం శ్రోతల్లో బడబాగ్ని పుట్టించాలి. తాను జన్మించిన నేల, తన ప్రజలు, తన సాహిత్య కళారంగం పట్ల తనదెన బాధ్యత ఉందని నమ్మే కవి అందెశ్రీ**

వ్యాస వాల్మీకులను అనుకరించినవారు మార్గకవులయ్యారు. అనువదించినవారు ఆదికవులయ్యారు. స్వర్ణకంకణ భూషితులయ్యారు. గిరిజనుల్లో జానపదుల్లో భాగమె కవిత వెలయించినవారు దేశీకవులయ్యారు. చాలాసార్లు కవులు కాకుండా పోయారు. కరుడుగట్టిన సాహిత్య విలువల్ని ఛేదించడానికి కొన్ని ప్రజాస్వామిక ప్రయత్నాలు జరిగినా సఫలం కాలేదు. రాతకి అచ్చుకి ఉన్న విలువ నోటి సాహిత్యానికి లేకుండా పోయింది. ఐనా ప్రజల తరవున అపురూపమెన మట్టి సాహిత్యం సజీవ కళగా అలరారుతూనే ఉంది. పైగా

Best Wishes to Gangadhar's Bhagavadgita from Lyricist Sri Andesri

ప్రతిదశలో రాత సాహిత్యానికి చోదకశక్తిగా పని చేస్తున్నది.

అశేష జనబాహుళ్యాన్ని తట్టి లేపే కొత్త సాహిత్యం గరిమెళ్ళ, నాజర్, సుంకర, యాదగిరి, సుద్దాల హనుమంతు, తిరునగరి రామాంజనేయులు, వంగపండు, గద్దర్, గూడ అంజయ్యలని చిరునామాగా చేసుకుంది. నిజానికి చాలావరకు తెలుగు కవిత్వం ఇతర భాషా సాహిత్యాల అనువాదంగా కనిపిస్తుంది. తళతళలాడే, ఉట్టిపడే కొత్తదనం కనిపించని ఈ కాలంలో వినే చెవులు చూసే కళ్ళుండాలేగాని అందెశ్రీ, గోరటి వెంకన్నల కవిత్వ జలపాతాలు, సెలయేర్లు మనల్ని విస్మయపరుస్తాయి. 1995 నుండి సాహిత్య కళారంగంలో చాలాకాలంగా వినిపిస్తూ వచ్చిన రాగాల స్థానంలో కొత్త సప్తస్వరకవితా గాన వేదికలు కొత్తగా సమాజసాహిత్య శిథిలాల నుండి బయల్పడ్డాయి.

అందెశ్రీఅవి అంతకుముందు వినిపించని జన రంజనంలు...కనంపించని శ్రమరాగపు సింగిడీలు...ఊహించని అశ్వవేగపు పల్లవులు...తాకని జీవితపు ఐమూలలు.

తెలుగు కవిత్వపు పాతవాసనలో నవపరిమళ వీచికలు ఇవి. కొమ్మలు దేవతా బొమ్మలైన విధం, అగ్ర ఆధిపత్య సంస్కృతికి బలైన ఊరు అన్నీ కొత్త బాణీలే. ఈ బాణీలు కనుపించని విల్లమ్ములు. మాయమయ్యే మనిషిని పట్టి నిలిపిన మాంత్రిక పరుసవేదులు. నిజానికి ప్రజలే ప్రాణంగా భావించే ప్రణాళికలు, ప్రజాకళలు పనిచేయని చోట జనాన్ని నిరాశవైపు, నిస్పృహవైపు పోనివ్వకుండా మనుషులని, గ్రామాల్ని, కన్నతల్లిలాంటి మూల సంస్కృతుల్ని నిలుపుకోవాలని విలక్షణరీతిలో పిలుపునిచ్చిన కవులు వీరే. అలాంటి ఒక పాటకు అరుదెన పురస్కారం లభించింది. ఆ పాట నిర్మాణానికి పడిన ఒడిదుడుకు లేమిటి? చూద్దాం.

**ఆ పాట పేరు అందెశ్రీ:**

అతడిది జిల్లా వరంగల్లు, మండలం మద్దూరు, ఊరు రేబర్తి. అంటరానింటిలో అంటరానివానిగానే పుట్టాడు. పడుతున్న సకల కష్టాలను మరిచిపోవడానికి పాటని గొణుక్కోవడం తప్ప మరేమి చేయలేక పోయాడు. ఏడో ఏట, చిరుతల అల్లీరాణి యక్షగానంలో కట్టిన వేషానికి ఆదరించిన వారే అతని ఇంటి లోని పరిస్థితుల్ని గేలి చేయడం సహించలేదు. అందెశ్రీ బతుకు జరుగుబాటులో అపశ్రుతులు. విచ్ఛిన్నమెన కుటుంబ సంబంధాలే అధికం. తల్లి బతికి ఉన్నా అనాథ. తండ్రి ఇంట ఉన్నా అనాదరణ. పాటని గొణుగుతూ సణుగుతూ బతుకు ఈడ్వడం. రాత్రి విన్న యక్షగానాల, వేసిన కోలాటాల పాటల్లోంచి అర్ధరాత్రి పొలాలకి మోటకొట్టడానికి వెళ్ళి పనిపాటలు విన్నాడు. ఆ పాటల్ని ప్రేమించాడు. ఏకసంథాగ్రాహి కావడం వల్ల బాణీ, చరణాలు అతని తోబుట్టువులయ్యాయి.

మల్లారెడ్డి సహచర్యం ఆధ్యాత్మిక చింతనకి దారివేయగా మునీరుద్దీన్ సేటు కుట్టించిన కొత్త బట్టలు వైరాగ్య విముక్తి భావన కలిగించాయి. ఈ రెండు దశల మధ్యలో మనసుకి తగిలిన గాయాలు మౌనాన్ని తట్టి లేపాయి. మౌనం ఎడ్డితనంగా భావించింది లోకం. మూగబారిన బతుకు, పౌష్టికాహారలోపం, శల్యమైన బాల్యం. ఇవీ ఆనాడు అందెశ్రీ ఎదుర్కొన్న సమస్యలు. తల్లి, ఇల్లు, ఊరు నిరాదరణలో సహజంగానే పరలోక ధ్యాస ఏర్పడింది. సన్యాస జీవితంవెపు లాలస. నిరాశ. వీటిమధ్య సుద్దాల రాసిన పల్లెటూరి పిల గాడా / పాలబుగ్గల జీతగాడా పాట, గద్దర్ రాసిన దుక్కిదున్ని దుక్కిదున్ని బొక్కలిరిగెనా/మాయన్నా జీతగాడ/వొరం చెక్కి వొరం చెక్కి/వొరిగిపోతివా అనేపాట అనాడు తాను గడుపుతున్న జీవితానికి అద్దం పట్టాయి.

తనకి తెలియకుండానే తానుకూడా తన బతుకుని అలాంటి రాగాలలోకి మార్చడానికి ప్రయత్నం చేశాడు. బొమ్మల పెళ్ళిలా జరిగిన బాల్య వివాహం, చేదు అనుభవం మిగిల్చిన కాపురం కాని కాపురం. మళ్ళీ కుటుంబం శత్రువులా మారిన వైనం. అలాకాకుండా బతుకు బయళ్ళలో మాత్రం అంతా పచ్చదనమే. ఇంటిని మరవడానికి ఊరు దగరయింది. అందుకే కనిపెంచిన ఊరు నా కమనీయ జ్ఞాపకం అంటాడు. ఆధ్యాత్మిక గీతాలు, భజన పాటల కన్నా బతుకు పల్లవులే ఆసరా ఇచ్చాయి. అటు తురకల గోరీలు, ఇటు మాదిగల బొందలు, మాలల సమాధులు వీటి మధ్య మునీర్ సేటు వ్యవసాయ బాయి. ఈ బాల కార్మికుడు. పాలబుగ్గల జీతగాడు. గడ్డపారతో తవ్వుతుంటే పాదం చిల్లుపడింది. ఆర్నెల్లు సలపరం. అణా మందెందుకు దండగ అన్న తండ్రి. చిన్నాన్న ఆగయ్య చిన్నమెత్తు సహకారం ఒక జ్ఞాపకం. ఆ కష్టాల కాలంలో అను పల్లవి స్వాంతన పరిచింది. పాట ప్రవాహం అయింది. గొంగళి పురుగుకి రెక్కలు వస్తేనే కదా సీతాకోకచిలుక. పాటలు నాకు రెండు రెక్కలె మొలిచాయి అంటాడు.

గాయం మానుతున్న కొద్దీ గేయానికి దగ్గరెంది అందెశ్రీ మానసిక జీవితం. బావతో కలసి నిజామాబాదుకి కూలీగా వలస వెళ్ళాడు. కూలీగా, మేస్త్రీగా పని చేయడంవల్ల అర చేతులనిండా పొక్కులు. ఆహారలేమి వల్ల దృష్టి బలహీనత. బతుకుని గెలవగలనని భరోసా ఇచ్చింది తాపీమేస్త్రీ పని. అప్పుడు రోజుకి పదమూడు రూపాయల కూలి. అప్పుడే శంకర్ మహారాజ్ సహచర్యం. అతనో ఆధ్యాత్మిక గురువు. నిత్యం ఉపనిషత్తులు, వేదాంగ పఠనం అక్కడ. అతని బోధలవల్ల పెరిగింది కొద్ది దార్శనికత, కొంత ఆధ్యాత్మిక చింతన. చిన్న స్వామిగా గుర్తింపు వచ్చింది. కాని ఈ స్వామికి కళ్ళ ముందు జోగినుల లైంగిక దోపిడి కనిపించింది.

రెండు గ్లాసుల టీ మరకలు గగుర్పొడిచాయి. ఎందుకు స్వామీ ఈ తేడాలు ఆధ్యాత్మిక ఔన్నత్యం పక్కనే మానవ అధమ దౌర్జన్యం? బుద్ధుడు, కారల్‌మార్క్స్, వివేకానందుడు, అంబేద్కర్ అందరూ కలిసి కూడా విప్పలేని పజిల్‌ని ఏ స్వామీజీ అయినా చెప్ప గలడా? అప్పటినుండి దాన్ని విప్పి చెప్పడానికొక బాణీని వెదకడమే అతని పనయింది. కృషి అయింది. కొన్నిరోజుల తరువాత మహారాజ్ గురువుగారు యజ్ఞం చేయాలని భావించాడు. రుత్వికుడిగా చిన్న స్వామిని కూర్చోబెడితే తామెవరం పాల్గొనమన్నారు ఆరువందల మంది శిష్యులు. జందెం లేకపోతే జందెం వేస్తాను. మంత్రోచ్చాటనలతో ఉపనయనం చేస్తానన్నాడు. కులం లేకపోతే దత్తత తీసుకుంటానన్నాడు. స్వామి ఆధ్యాత్మికత ఏమోగాని మనిషిగా మహావ్యక్తి. మంచి వ్యక్తిగా మారడానికి ఆధ్యాత్మికం కూడా అవసరమా అని సందేహిస్తాడు అందెశ్రీ.






## తెలుసుకోండి'లా'

# అసైన్డ్ స్థలాన్ని ఏమి చేయలేరా

నేను ఓ అపార్టుమెంటులోని ఒక పెంట్‌హౌజ్ తీసుకొన్నాను. మా అపార్టుమెంట్‌కు ఫ్లాట్ ఓనర్స్ అసోసియేషన్ (పాలకమండలి) కలదు. ఆ కమిటీలో ఎవరి ఇష్టం వచ్చినట్లు వాళ్లు ప్రవర్తిస్తూ... మాకు నీటి వసతి సక్రమంగా ఇవ్వకపోవడం, మెట్లు పూర్తిగా శుభ్రంగా చేయక పోవడంతో నేను 4 నెలల నుండి ప్రతినెల మెయింటెనెన్స్ ఇవ్వలేదు. దీంతో నాకు విద్యుత్, నీటి వసతి తొలగించారు. అంతటితో ఆగకుండా సంబంధిత అధికారులకు నాకు నీటి వసతి, విద్యుత్ సరఫరా తొలగించాల్సిందిగా... కమిటీ లెటర్‌హెడ్‌పై ఫిర్యాదు చేసినారు. ఈ విషయంలో నేను పోలీసులకు ఫిర్యాదు చేసినప్పటికీ వారు ఎలాంటి చర్యా తీసుకోలేదు. అదేమని అడిగితే... ఇది సివిల్ కేసు, మేం జోక్యం చేసుకోమని అన్నారు. ఇదే అపార్టుమెంట్‌లో ఒక డబుల్ బెడ్‌రూం ఫ్లాట్ ఓనర్ ఇంట్లోనే కొవ్వొత్తులు, ఫినాయిల్ తయారు చేస్తున్నాడు. దీనికి న్యాయబద్ధమైన పరిష్కారం తెలియజేయండి. అలాగే ఫ్లాట్ ఓనర్స్ అసోసియేషన్ విధివిధానాలు, అధికారాలను క్లుప్తంగా వివరించండి.

– రాఘవేంద్ర, హైదరాబాద్

ఆంధ్రప్రదేశ్ అపార్ట్‌మెంట్స్ చట్టం 1997లో అమలులోనికి వచ్చింది. ఇందులోని మూడవ సెక్షన్ ఉమ్మడి నిర్వహణ ఖర్చు (కామన్ ఎక్స్‌పెన్స్) గురించి పలు అంశాల్ని క్లుప్తంగా చెబుతుంది.




అపార్టుమెంట్‌లో నివసించేవారు మంచి నీరు, విద్యుత్తు, భద్రత, లిఫ్టు, కామన్ ఏరియాల్లో పరిశుభ్రత ఇలా వివిధ అవసరాలని మిత్తం నిర్వహణ రుసుము చెల్లించవలసి ఉంటుంది. అపార్టుమెంట్ నిర్వహణ, మరమ్మతులు, లిఫ్టు జనరేటర్ వంటివి పాడైతే కొత్త వాటిని బిగింపచేయడం తదితర నిర్వహణ ఖర్చులతో భాగమేనని గుర్తుంచుకోండి. అపార్టుమెంటులో నివసించే వారి కోసం చేసే ప్రతి పైసా అందులో నివసించేవారు భరించాల్సిందే. ఇదే విషయాన్ని అసోసియేషన్ సంఘాలు తమని యమనిబంధనల్లో పేర్కొంటాయి. ప్రతి అపార్టుమెంట్ కమిటీ తప్పనిసరి ఒక 'బై లా' (నియమ నింబంధనల ప్రకారం) రిజిస్టర్‌ను జిల్లా రిజిస్ట్రార్ అఫీసులోని రిజిస్ట్రేషన్ చేయిస్తారు. దానికి గాను ప్రతినెల అపార్టుమెంట్‌కు కావలసిన ఖర్చుల అంచనా ప్రకారం ప్రతి ఒక్కొక్కరు ప్రతి నెలకు ఒక జనరల్ బాడీ మీటింగ్ దాని ప్రకారం కొంత డబ్బు వసూలు చేసి దానిని ఖర్చు పెట్టగల అధికారం కమిటీకి ఉంటుంది. కావున నియమ నిబంధనలు అతిక్రమించకుండా మీరు ప్రతినెలా మెయింటెనెన్స్ చెల్లించి... మీకే మైనా ఇబ్బందులు ఉంటే కమిటీ మీటింగ్‌లో చర్చించుకోవాలి. అంతే కానీ, సమస్యలు ఉన్నాయని మెయింటెనెన్స్ కట్టకపోవడం న్యాయ సమ్మతం కాదు. అలాగే... మీకు కమిటీ సభ్యులు ఎటువంటి అవసరాలు తీర్చక పోయినా... కమిటీతో చర్చించి అవసరం అనుకుంటే కమిటీని మార్చే అధికారం కలదు. ప్రతి రెండు సంవత్సరాలకు ఒకసారి ఎలక్షన్ పెట్టి ప్రెసిడెంట్‌ను ఎన్నుకునే అధికారం కలదు. అంతే కాకుండా ఎవరైనా సభ్యులు వ్యతిరేకించి నచో... వాళ్లు కమిటీ అనుమతి లేకుండా ఫ్లాట్ అమ్మడం, కొనడం జరుగనేరవు. కావున కమిటీతో చర్చించి మీ సమస్య పరిష్కారం చేసుకో గలరు. సెక్షన్, 12, 20 చాప్టర్ 3వ భాగం ప్రకారం కామన్ నిష్పత్తి స్థలాన్ని బట్టి పార్కింగ్ గానీ ఇతర నివాస అపార్టుమెంటులకు గానీ వసతులతో పాటుమెయింటెనెన్స్ వేసే అధికారం కూడా కమిటీకి కలదు.

★★★

నేను... ఒక వ్యక్తి హైదరాబాద్‌లోని ఐదు ఎకరాల స్థలం కొని ప్లాట్లు చేసి అమ్ముతుండగా అందులో ఓ 400 గజాల స్థలం కొని ఇంటి నిర్మాణం కోసం దానిని చుట్టూ ప్రహరీ కట్టించుకొన్నాను. దీని కోసం కరెంటు బిల్లు, వాటర్ బిల్లులు క్రమం తప్పకుండా చెల్లిస్తు న్నాను. ఈ భూమిని రిజిస్ట్రేషన్ కూడా చేయించు చుకున్నాను. ఇప్పుడు స్థానిక రెవెన్యూ అధి కారి... ఈ ఐదెకరాల భూమి ఆర్‌వోఆర్ ప్రొసీ డింగ్స్, పాస్ పుస్తకం, టైటిల్ డీడ్‌ను ఎందుకు రద్దు చేయకూడదో పదిరోజులలో వివరణ ఇవ్వాలనీ, లేని పక్షంలో భూమిని ప్రభుత్వం స్వాధీనం చేసుకుంటా మని నోటీస్ జారీ చేశారు. ఈ విషయం గురించి నేను హైదరాబాద్ లోని రెవెన్యూ అధికారులను కలువగా అది అసైన్డ్ భూమి అని తెలిసినది. ఇప్పుడు నాకు ఏం చేయాలో తెలియడం లేదు. అసలు అసైన్డ్ భూమి అంటే ఏమిటి? దానిని ఎలా గుర్తించాలి. లావణి పట్టీ అంటే ఏమిటి? పూర్తి వివరాలు తెలియజేయగలరు.

– వినోద్, వరంగల్

మీరు కొన్న భూమి అసైన్డ్ స్థలం అయినప్పుడు మీరు ఏమీ చేయలేరు. కావున వెంటనే ఎవరి వద్ద మీరు ఈ స్థలం కొన్నారో పూర్తి వివరాలతో మీ దగ్గరలోని పోలీస్ స్టేషన్‌లో ఫిర్యాదు చేస్తూ దానితో పాటు జిల్లా కలెక్టర్, మండల రెవెన్యూ అధికారి గారికి విడివిడిగా దరఖాస్తు చేసుకొని జరిగిన విషయాలు వ్రాత పూర్వకంగా తెలియ జేసి... పత్రం ముట్టి నట్లు రశీదు తీసుకోగలరు. తరువాత రెవెన్యూ అధికారులు విచారణ చేసి దానికి ప్రతిఫలంగా వేరొక చోట స్థలం గానీ, లేదా అదే స్థలానికి పట్టా 'డి' సర్టిఫికెట్ గానీ ఇస్తారు. ఏదేమైనా ఈ విషయంలో సర్వ హక్కులూ రెవెన్యూ అధికారులకే చెందుతాయి. మీరు మంచి న్యాయవాదిని సంప్రదించి కేసు వేసినచో మీకు న్యాయం జరుగుతుంది. మీకు నష్టపరిహారం కావాలనుకున్నచో మీకు స్థలం విక్రయించిన వ్యక్తిపై సివిల్, క్రిమినల్ కేసులు వేయండి. ఇక మీరు అసైన్డ్ భూమి గురించి తెలుపమని అడిగారు. అసైన్డ్ భూమి అనగా ప్రభుత్వానికి చెందిన భూమని అర్థం. దీనిని ప్రభుత్వం వారు భూమి లేని నిరుపేదలకు, స్వాతంత్ర్య సమరయోధులకు, రాజకీయ బాధితులకు, ఎక్స్ సర్వీస్‌మన్‌లకు ఇస్తారు. ఇలాంటి స్థలాన్ని మీరు ఈ భూములను ఎలా గుర్తించాలం టే... సేత్వార్ అనగా అసలైన సర్వే రికార్డుల్లో చూడటం వలన మనం కొనే భూమికి సంబంధించిన సర్వే నెంబర్ గ్రామం పేరు తదితర వివరాలను ప్రతి మండల ఆఫీసు లోని చూడటానికి వీలుంటుంది.

---

## లక్కీ నంబర్

# ఎక్కడికెళ్లినా దురదృష్టం

న్యూమరాలజీ శీర్షిక ప్రవేశపెట్టిన సూర్య పత్రికకు హృదయపూర్వక ధన్యవాదములు. ఎందరెందరో ఈ శీర్షిక ద్వారా మేలుపొందుతున్నారు. దయచేసి నా పేరులో ఏమన్నా మార్పులు ఉంటే సూచించగలరు.

**సి. రవి, సంగారెడ్డి**

రవి అని పిలిచే పేరులో డెత్ నెంబర్ 13 ఉన్నది. దీని వలన అన్నీ వ్యతిరేకమే. రవికుమార్ అనే పేరులో బాంబ్ బ్లాస్ట్ నంబర్ 16 ఉన్నది. ఇది కూడా వ్యతిరేక ఫలితాలనిచ్చే నెంబరే. అందుకని మీ పేరుని **RAVVE KKUMARR** అని 40 సార్లు రాయండి. అలా రాసుకునే పేరులో మీకు అన్నీ కలిసొచ్చే అదృష్టం దాగుంది.

★★★

మహమ్మద్ అలీముద్దీన్ నా పేరు. 12-3-1965 నా పుట్టిన తేదీ. నాకు వ్యాపారంలో అన్నీ నష్టాలే వస్తున్నాయి. మానసిక ప్రశాంతత కరువయింది. ఇంట్లో కూడా ప్రశాంతత లేదు. తెలిసిన వారంతా అలీమ్ అని పిలుస్తారు.

**అలీముద్దీన్, హైదరాబాద్**

★★★

అలీమ్ అనే పేరులో రక్తం కారుతున్న చంద్రుడి నంబర్ 18 ఉంది. అందువలన ఇంట్లో మీరు మీ భార్యతో గొడవలు పడుతుంటారు. ఈ నంబర్ ప్రభావం వలన ఆర్థిక నష్టాలుంటాయి. మీరు మీ పేరును **ALLEEUM** అని 27 సార్లు రాయండి. 27 రోజులు 27 కోర్సులుగా కనుక ఈ పేరును రాసుకుని జీవితకాలం వాడుకున్నట్లయితే మీరు మంచి అదృష్టవంతులవుతారు. దీనిని ఎంపరర్ నంబర్ అని అంటారు. కమల్‌హాసన్, ఎన్‌టిరామారావ్, రజనీకాంత్‌లలో ఈ నెంబరే ఉంది. అందుకే వారు ఉన్నత స్థితిలో ఉన్నారు.

★★★

నా పేరు కేదరశెట్టి రామం. పుట్టినతేదీ 7-9-1957. ఉన్న ఆస్తిని పోగొట్టుకున్నాను. వ్యాపారంలో ఆర్థికంగా బాగా నష్టపోయాను. అన్నిరకాలుగా నేను జీవితంలో వెనుకబడిపోయాను. దయవుంచి నాకు మంచి సలహా ఇవ్వగలరు.

**కె. రామం, నిడదవోలు**

మీ పేరులో మొత్తం 16 అక్షరాలున్నాయి. దీని ప్రభావం వలన అన్నిటిలోనూ మీరు వెనకబడిపోతారు. కె. రామం అని సంతకం చేస్తున్నారు. అందులో వ్యతిరేక ప్రభావం చూపే ఆరు, మూడు అంకెలు ఉన్నాయి. అందువలన మీ జీవితం ఆరుమూడవుతున్నది. రాము అని పిలిస్తే అందులో డెత్ నంబర్ 13 ఉన్నది. అది కూడా మంచిది కాదు. అందుకని మీరు మీ సంతకాన్ని **RAUMOM** గా వాడండి. అత్యంత ప్రభావం చూపే 24వ నంబర్ ఇందులో ఉన్నది. ఇక నుండి మీరు అన్నీ ఘనవిజయాలే సాధిస్తారు.

నా పేరు జి. సత్యనారాయణ. పుట్టిన తేదీ తెలియదు. ఏ పని చేసినా కలిసిరావడంలేదు. కిరాణాషాపు ఉంది. ఇప్పటిదాకా దానికి మూడు స్థలాలు మార్చినాము. ఎక్కడికెళ్లినా దురదృష్టం మమ్మల్ని వెంటాడుతూనే ఉంది. ఇచ్చిన బాకీలు వసూలుకావడంలేదు. బాకీలు ఇచ్చినవారు మాత్రం విపరీతమైన ఒత్తిడి చేస్తున్నారు. దీనికి పరిష్కారం తెలపండి.

**జి. సత్యనారాయణ, తణుకు**

సత్యనారాయణ అనే పేరులో రాంగ్ నంబర్ కలదు. సత్యలో కూడా రివర్స్ నంబర్ కలదు. సత్య అని పిలిపించుకోకూడదు. సత్యనారాయణ అనే ఆంగ్ల అక్షరాలను **SATYAANARAYANA** గా 28 సార్లు 28 కోర్సులుగా రాసుకోండి. 1, 5 మీ లక్కీ నంబర్లు. ఇలా రాసుకుంటే మీ జీవితంలో అనుకున్నది సాధిస్తారు.

★★★

నాపేరు టి. లక్ష్మి నరసింహులు . పుట్టిన తేదీ 19- 5- 1966 . నేను చేస్తున్న కృషికి సరైన ఫలితం లభించుట లేదు. ఎప్పుడూ నెగెటివ్ ఆలోచనలే వస్తున్నాయి. ఎందుకిలా జరుగుతోందో తెలియడంలేదు. ఏదైనా మార్పులు ఉంటే సరిచేసి నాకు జీవితంలో సరైన మార్గం సూచించండి.

**లక్ష్మినరసింహులు , బీబీనగర్**

మీ పేరు లోని అక్షరాలకు న్యూమెరికల్ నెంబర్‌కు 1,6 సంబంధం వున్నది. అందువల్ల మీ అభివృద్ధికి అవరోధాలు ఏర్పడుతున్నాయి. మిమ్మల్ని **" lakshmi "** అని పిలవ దం ద్వారా ఆ పేరులో అంతర్లీనంగా 18 నంబర్ వున్నది. అది దురదృష్టకరమైనది. దీని ప్రభావం వల్ల మంచి ఫలితాలు పొందలేరు. **lashmi narasimhulu** అని పిలిస్తే బ్లాస్టింగ్ నెంబర్16 వస్తుంది అందుకని **T.L . Narasimhulu** అని రోజుకు 50 సార్లు 50 రోజులు వ్రాయండి.' నరసింహులు' అని మాత్రమే పిలిపించు కోండి. అదృష్ట సంఖ్యలు 3,5.ఇలా రాసుకునే పేరులో అదృష్టం ఉంది.

★★★

నా పేరు భానుమూర్తి . పుట్టిన తేదీ 26-3- 1972 . అన్ని ఉన్నట్లే అనిపిస్తుంది..తీరా చూస్తే నిరాశ ఆవహిస్తుంది. ఇంకా పిల్లలు కలగలేదు. జీవితంలో నాకు ప్రశాంతత లేదు. జీవితంలో నేను అభివృద్ధిలోకి రావాలంటే ఏం చేయాలి ?

**భానుమూర్తి, ఖమ్మం**

మీ పేరులో 4 వ నంబరున్నది. ఇది చాలా సున్నితమైనది. ఈ పంబర్ ప్రభావం వలన కేవలం ప్రాపంచిక విజయాల వల్లనే సంతృప్తి చెందలేరు. ఇతరుల మీద ఎక్కువ దయ గలవారై వారి బాధలను కూడా మీరే అనుభవిస్తారు. మీరు ఒక శిశువును దత్తత తీసుకోవడం కూడా ఈ నంబర్ ప్రభావమే. ఈ విషయంలో మీ త ల్లిదండ్రులు వ్యతిరుకించడం సహజం. ఎందుకంటే వారి పేర్లలో ఈ నంబర్‌లేదు. దుఃఖానికి , నిరాశకు ఈ నంబరే మూలం. bhanumoorty అని రోజుకు 44 సార్లు , 44 రోజు లు వ్రాయండి. అదృష్ట సంఖ్యలు 1, 8. దీని వల్ల ఇక నుంచి అంతా మంచే జరుగుతుంది. మీకు లేదనే భావన కలుగదు. జీవితంలో మీకు కావలసినవన్ని పొందుతారు ఆ రోజు ఎంతో దూరంలో లేదు.

★★★

నా పేరు ఎస్ కృష్ణయ్య . పుట్టిన తేదీ 5-3- 1967 నేను మంచి ఉద్యోగమే చేస్తున్నాను. ఇంట్లో నామీద ఆధారపడే వారి సంఖ్య ఎక్కువగా వుంది. ఖర్చులు పెరిగిపోతున్నాయి. దీనినుంచి బయటపడేదెలా తెలపండి ?

**ఎస్ . కృష్ణయ్య , కుప్పం**

5 వతేదీన పుట్టినందువల్ల మీరు అదృష్టవంతులు. కృష్ణయ్య అనే పేరులో అంతర్లీనంగా 33 నంబరు ఉంది. ఆత్మబలిదానం నంబరు ఉంది. దీని ప్రభావం వలన మీరు ఇష్టపడే ఇతరుల కొరకు డబ్బు ఖర్చు చేస్తారు. తద్వారా బలైపోతారు. ( తిరుపతి పద్మావతి కాలేజీలో నాకు తెలిసిన విద్యావంతులైన మహిళలు ..ఉన్నతోద్యోగాలు నిర్వహిస్తూ..పెళ్లి చేసుకోకుండా.. తమ సోదర, సోదరీ మణులకు, తల్లిదండ్రుల కోసం జీవితాలను త్యాగం చేసినారు. వీరందరి పై పరిశోధన చేయగా ..ఆ పేర్లన్నింటిలోను ఈ నంబరున్నది.)krisnnaiah అని రోజుకు 26 సార్లు, 26 రోజులు వ్రాయండి.



యవ్వనంలో తప్పులు, పొరపాట్లు చేయడం, పెద్దవారైన తరువాత జీవన పోరాటం, వృద్ధాప్యంలో విచారం- ఇదే సాధారణంగా అందరి జీవితం. -డిస్రేలీ

# హాలీవుడ్ కలలు

సౌత్‌లోనో.. రీజనల్ గానో పేరు తెచ్చుకున్న చాలామంది బాలీవుడ్ కలలు కనేస్తూ ఉంటారు. హీరోయిన్లకు ఎక్కువగాను.. హీరోలకు కాస్త తక్కువగాను ఈ డ్రీమ్స్ బయటపడుతుంటాయి. అయితే బాలీవుడ్ లో పేరు తెచ్చుకున్న తారలు.. హాలీవుడ్ కలలు డ్రీమ్స్‌లో మునుగుతూ ఉంటారు. బాలీవుడ్‌లో వెలిగిపోతున్న శ్రీలంక అందం జాక్వెలిన్ ఫెర్నాండెజ్.. కిక్ తో పేరు సంపాదించే సమయానికి.. ఓ హాలీవుడ్ సినిమా చేసింది. 'డెఫినిషన్ ఆఫ్ ఫియర్' అనే మూవీలో సైకాలజీ స్టూడెంట్ గా నటించింది కానీ.. ఇది ఎక్కడా రిలీజ్ కాలేదు. ఫిలిం ఫెస్టివల్స్ లో మాత్రం ప్రదర్శనల కోసం చక్కర్లు కొడుతోందనే మాట వినిపించిందంతే. ఈ లోగా జాక్వెలిన్ మాత్రం బాలీవుడ్‌లో జెండా పాతేసింది. బిపాషా బసు 'సింగ్యులారిటీ' అనే సినిమా హాలీవుడ్ మూవీలో నటించింది. స్వతంత్రం రాకముందు ఇండియాలో జరిగిన కథాంశంపై టైమ్ ట్రావెల్ కాన్సెప్ట్‌తో తీశారు. తర్వాత పేరు మార్చి ది లవర్స్ అంటూ కంటిన్యూ చేశారు. అయినా రిలీజ్ కి నోచుకోలేదు. చివరకు మళ్లీ పేరు మార్చి 'టైమ్ ట్రావెలర్' అంటూ డీవీడీల రూపంలో యూకే వరకూ విడుదలైందంతే.



బాలీవుడ్ హాట్ బ్యూటీ బిపాసా బసు ఇటీవల కర్ సింగ్ గ్రోవర్‌తో మూడు ముళ్ళు వేయించుకున్న సంగతి తెలిసిందే. ప్రస్తుతం సినిమాలేవి ఈ అమ్మడి చేతిలో లేకపోవడంతో తన హస్బెండ్‌తో కలిసి టూర్లు వేస్తోంది. లైఫ్‌ని ఫుల్‌గా ఎంజాయ్ చేస్తోంది. ఇక తన అభిమానులను సినిమాలతో అలరించకపోయినా... తాను ఎంజాయ్ చేస్తోన్న ప్లేస్‌లకి సంబంధించిన అప్‌డేట్స్ ఎప్పటికప్పుడు అందిస్తూ వారిని ఉత్సాహపరుస్తోంది. ప్రస్తుతం బిప్స్ ఇండోనేషియా సమీపంలోని బాలి అనే ఐలాండ్‌లో తన భర్తతో కలిసి ఎంజాయ్ చేస్తోండగా, తాను బికినీ వేసుకున్న ఫోటోలను కొన్ని సోషల్ మీడియాలో షేర్ చేసింది. పెళ్ళైన తర్వాత కూడా ఈ అమ్మడు తన అందాలని ఆరబోస్తూనే ఉండడంతో అభిమానులు షాక్ అవుతున్నారు. కొందరైతే పెళ్ళి తర్వాత బిపాసా చాలా అందంగా కనిపిస్తోందంటూ చెబుతున్నారు.

**పెళ్లయినా తరగని అందాలు:**

2001లో అజ్‌నబి చిత్రంతో తెరంగేట్రం చేసింది బిపాసాబసు. తెలుగులో మహేష్‌బాబుతో టక్కరిదొంగ చిత్రంలో మెరుపులా మెరిసింది. 2002లో వచ్చిన రాజ్ చిత్రంతో ఒక్కసారిగా స్టార్‌డమ్ అందుకుంది బిప్స్. బాలీవుడ్ హాట్ బ్యూటీ బిపాసా బసు ఇటీవల కరణ్‌సింగ్ గ్రోవర్‌తో మూడు ముళ్ళు వేయించుకున్న సంగతి తెలిసిందే. ప్రస్తుతం సినిమాలేవి ఈ అమ్మడి చేతిలో లేకపోవడంతో తన భర్తతో కలిసి టూర్లు వేస్తోంది. లైఫ్‌ని ఫుల్‌గా ఎంజాయ్ చేస్తోంది. ఇక తన అభిమానులను సినిమాలతో అలరించకపోయిన, తాను ఎంజాయ్ చేస్తోన్న ప్లేస్‌లకి సంబంధించిన ఫోటోలను సోషల్ మీడియాలో పోస్ట్ చేస్తూ..వారిని ఉత్సాహపరుస్తోంది. పెళ్ళైన తర్వాత కూడా ఈ అమ్మడు తన అందాలని ఆరబోస్తూనే ఉండడంతో అభిమానులు షాక్ అవుతున్నారు. కొందరైతే పెళ్ళి తర్వాత బిపాసా చాలా అందంగా కనిపిస్తోందంటూ కామెంట్ చేస్తున్నారు. అయితే కరణ్‌సింగ్ గ్రోవర్ తనకు బిపాసాపై ఉన్న ప్రేమను తెలియజేస్తూ.. తను లేకపోతే రాత్రుళ్ళు నిద్రపట్టదని చెబుతున్నాడు. "దంపతులు ఒకరికొకరు సర్‌ప్రైజ్‌లు ఇచ్చుకోవడం వల్ల వాళ్ల మధ్య అన్యోన్యత పెరుగుతుంది. రొమాన్స్ కూడా ఎప్పటికీ నిలిచిపోతుంది. అందుకే నా జీవిత భాగస్వామికి ఎప్పుడూ సర్‌ప్రైజ్‌లు ఇవ్వాలని అనుకుంటా.

**బిప్స్ లేకుండా క్షణం కూడా ఉండలేను:**

కరణ్ మాట్లాడుతూ...నేను ఎప్పుడైనా నిరుత్సాహంగా ఉంటే బిపాసా.. ప్రేమగా మాట్లాడి నాలో కొత్త ఉత్తేజాన్ని నింపుతుంది. అందుకే బిపాసా లేకుండా ఒక్క క్షణం కూడా ఉండలేను. తను ఎప్పుడెనా బయటకు వెళ్తే అసలు నిద్రపట్టదు. కొన్ని సందర్భాల్లో బిపాసా నా మీద చికాకు పడటం.. కోప్పడటం లాంటివి చేస్తుంది. గర్ల్‌ఫ్రెండ్ మన మీద ఎంత అరిచినా కోపం రాదు. పైగా వాటిని పట్టించుకోం. అందుకే బిపాసాను ఇప్పటికీ భార్యగా కాకుండా గర్ల్‌ఫ్రెండ్‌గానే చూస్తున్నా. అందుకే ఆమె నామీద ఎంత అరిచినా పట్టించుకోను" అని తన మనసులోని మాటను బయటపెట్టాడు కరణ్.

బాలీవుడ్ హీరో రణవీర్ కపూర్.. కత్రినా కైఫ్‌కు దూరమయ్యాక మరో నటి జాక్వెలిన్ ఫెర్నాండెజ్‌కు దగ్గరయినట్టు వార్తలు వచ్చాయి. రణవీర్ జీవితంలోకి కొత్తగా జాక్వెలిన్ వచ్చినట్టు బాలీవుడ్‌లో పుకార్లు జోరందుకున్నాయి. జాక్వెలిన్ ఈ మధ్య ముంబైలో ఓ రెస్టారెంట్‌కు వెళ్లింది. తన స్టాఫ్‌లో ఒకరి బర్త్ డే వేడుకల్లో పాల్గొంది. ఈ సందర్భంగా మీడియా ప్రతినిధులు రణవీర్‌తో అనుబంధం గురించి జాక్వెలిన్‌ను ప్రశ్నించగా, మౌనమే సమాధానమైంది. ఈ ప్రశ్న వినిపించినా జాక్వెలిన్ వినపడనట్టుగా ఉండిపోయింది.

**జాక్వెలిన్ ఫెర్నాండెజ్:**

ప్రస్తుతం బాలీవుడ్‌లో జాక్వెలిన్ ఫెర్నాండెజ్ హవా మాములుగా లేదు. హౌస్ ఫుల్ త్రీ, డిషూ చిత్రాలతో జెట్ స్పీడ్‌తో దూసుకపోతుంది. అమ్మడి స్పీడ్ చూసి మిగతా హీరోయిన్స్ కుళ్లుకుంటున్నారు. తాను మాత్రమే హ్యాపీ ఉంటే ఎలా అనుకుందో ఏమో , వెంటనే వీపంతా చూపిస్తూ చీరకట్టుతో అందాల ఆరబోత చేసింది ఈ అమ్మడు. స్పెషల్‌గా డిజైన్ చేసిన కిటికీల జాకెట్‌తో కనిపించింది. ఈ పోజులో అమ్మడిని చూసి తట్టుకోలేకపోతున్నారు బాలీవుడ్ జనాలు. ఇప్పటికే ఇటీవల నటించిన రెండు చిత్రాలు 100 కోట్లు వసూళ్లు చేయడంతో దర్శక , నిర్మాతల చూపు అమ్మడిపై పడుతున్నాయి.రీసెంట్‌గా రిలీజయిన ఏ ఫ్లైయింగ్ జాట్ అనే చిత్రంలో టైగర్ ష్రాఫ్‌తో నటించింది. ఈ చిత్రం కూడా ఎబోవ్ యావరేజ్ అనిపించుకుంది. బాలీవుడ్ హీరో రణవీర్ కపూర్.. కత్రినా కైఫ్‌కు దూరమయ్యాక మరో నటి జాక్వెలిన్ ఫెర్నాండెజ్‌కు దగ్గరయినట్టు వార్తలు వచ్చాయి. రణవీర్ జీవితంలోకి కొత్తగా జాక్వెలిన్ వచ్చినట్టు బాలీవుడ్‌లో పుకార్లు జోరందుకున్నాయి. జాక్వెలిన్ ఈ మధ్య ముంబైలో ఓ రెస్టారెంట్‌కు వెళ్లింది. తన స్టాఫ్‌లో ఒకరి బర్త్ డే వేడుకల్లో పాల్గొంది. ఈ సందర్భంగా మీడియా ప్రతినిధులు రణవీర్‌తో అనుబంధం గురించి జాక్వెలిన్‌ను ప్రశ్నించగా, మౌనమే సమాధానమైంది. ఈ ప్రశ్న వినిపించినా జాక్వెలిన్ వినపడనట్టుగా ఉండిపోయింది. రణవీర్ గురించి పెదవి విప్పని ఆమె పార్టీ అయ్యాక అక్కడి నుంచి వెళ్లిపోయింది.

# జీవితమే ఓ దీపావళి







**దీపావళి పండుగ అనగానే అందరికీ ముందుగా గుర్తుకు వచ్చేవి టపాకాయలు. పండుగ రోజున పెద్ద ఎత్తున బాణసంచా కాల్చి పండుగ వేడుకలను జరుపుకోవడం ప్రతి ఏటా ఆనవాయితీగా వస్తోంది. క్రాకర్స్‌లేనిదే పండుగ లేదన్న రీతిలో నేడు వీటిని కాల్చి వేడుకను ఆనందోత్సాహాల మధ్య జరువుకుంటున్నారు. కానీ పెద్దగా శబ్దం చేస్తూ పేలే టపాకాయల మూలంగా శబ్ద కాలుష్యం జరుగుతోంది. ఇక బాణసంచాను కాల్చడం వల్ల వచ్చే పొగతో వాతావరణ కాలుష్యం కూడా అవుతోంది. ఈ నేపథ్యంలో దీపావళి పండుగను పర్యావరణ పరిరక్షణకు అనుకూలంగా జరువుకునేందుకు పర్యావరణ ప్రేమికులు ప్రజలను చెతన్య పరుస్తున్నారు. ఒప్పుడు కాలుష్యానికి తావు లేకుండా జరువుకున్న దీపావళి పండుగను నేడు అదేరీతిలో మళ్లీ జరుపుకోవాలని వారు పిలుపునిస్తున్నారు.**

దీపం తిమిర సంహారం జ్ఞాన స్వరూపం. దీపం వెలుగు జ్ఞానానికి ,ఆనం దానికి , వివేకానికి ప్రతీకగా హిందూ ధర్మం చెవుతుంది. అందుకే దీపం పరబ్రహ్మ స్వరూ పం అంటారు పెద్దలు. ద్వాపర యుగంలో నరకాసురుడు వర గర్వంతో పదహారు వేల మంది రాచకన్యలను చెరపట్టినప్పుడు, శ్రీకృాఎష్ణుడు సత్యభామ సమేతుడె వెళ్ళి నరకాసుర సంహారం చేసి ఆ పదహారు వేల మంది కన్యలను ద్వారకకు తీసుకు వస్తాడు . ఆ విజయా నికి గుర్తుగానే దీపావళి జరుపుకుంటున్నారు.

**దీవాలీ సందేశం:**దీపావళి పండుగ జరుపుకోవటంలో అంతర్లీనంగా ఒక సందేశం ఉంది. నరకుడు, నరకం చీక టికి ప్రతీకలు. నరకాసురుడు దేవతలను మునులను సత్పు రుషులను అవమానిం చాడు. యజ్ఞయాగాదులను జరుగ నివ్వలేదు... లోక కంటకునిగా తయారయ్యాడు. ఎప్పు డైతే ధర్మానికి విఘాతం కలిగి అధర్మం వృద్ధి చెందుతుందో అక్కడ తిమిరం అంటే అజ్ఞానం అనే చీకటి ప్రభలి పోతుంది. అందుకే లోకంలో ఆవహించిన చీకటిని పారద్రోలటానికి నరకా సురసంహారం జరిగింది. దీనికి గుర్తుగానే ప్రజలంతా దీపాలు వెలిగించారు...అదే దీపావళి.

> **ఎకో ఫ్రెండ్‌లీ క్రాకర్స్**
>
> పర్యావరణానికి మేలు చేసే ఎకో ఫ్రెండ్లీ క్రాకర్స్ ప్రజలకు అందుబాటులోకి రావడం విశేషం. దీపావళి పండుగను పురస్కరించుకొని రెండేళ్ల క్రితం తొలిసారిగా మార్కెట్లోకి ఇవి ప్రవేశించాయి. తక్కువ కాలుష్యాన్ని కలిగించడమే కాకుండా పెద్దగా శబ్దాలు చేయని టపాకాయలు ఇవి. తక్కువ ధరల్లో లభించే ఈ క్రాకర్స్ వివిధ రకాల ఆకులను పొందుపరిచి తయారుచేస్తుండడం విశేషం.

**పర్యావరణాన్ని కాపాడుకునే పండుగ:**దీపావళి జరుపుకోవటానికి సంబంధించి ఇంకో అంతరార్థం ప్రకృతికి సంబంధించినది. ఆశ్వీయుజ మాసానికి వర్షాకలం ముగిసి పోతుంది. దీపావళి సమయానికి శరదృతువు ప్రవేశిస్తుంది . అప్పటికే ప్రకృతి పచ్చదనంతోపాటు, క్రిమికీటకాలు ప్రబలుతాయి. పూర్వం రోజులలో ఆముదం దీపాలు వెలిగించేవారు. ఆముదం దీపం పొగ పర్యావరణరీత్యా మం చిది... అదీకాక దీపపు కాంతికి ఆకర్షింపబడి కీటకాలు, పురుగులు నశిస్తాయి. పంటలకు, మనుషులకు మంచి చేకూరుతుంది.

**టపాసుల చరిత్ర :** బాణాసంచా కాల్చటం మనదేశంలో ఐదు వందల సంవత్సరాల నుండే ప్రారంభమైంది. బాణా సంచా (టపాసులు) మొట్టమొదట చైనా వాళ్ళు తయారు చేశారు. అది క్రీ .శ ఏడు, ఎనిమిది శతాబ్దాలలో ప్రారంభమయిం దని చరిత్ర చెబుతుంది. క్రమంగా అక్కడ నుండి అరబ్బు లకు, యూరప్‌కు పాకింది. బాణాసంచా నుండి వచ్చే గంధ కం పొగ ఎన్నో రకాల క్రిమికీటకాలను నాశననం చేస్తుంది. అందుకనే బాణాసంచా కాల్చటం ఒక సంప్రదాయంగా స్థిరపడింది. మనదేశంలో ఒక్క దీపావళి రోజు రాత్రి రెండు వేలకోట్ల రూపాయల విలువైన బాణాసంచా కాలుస్తారు. తమిళనాడులోని శివకాశి దీపావళి టపాసులకు కేంద్రంగా పెద్ద ఎత్తున వ్యాపారకేంద్రంగా భాసిల్లుతోంది. దీపావళి పండుగ ప్రకృతికి మానవుల పశుపక్ష్యాదుల హితం చేకూర్చేది కావున, మనమంతా సరియైన పద్ధతిలో టపాసులు కాలుద్దాం, అగ్ని ప్రమాదాలు జరుగకుండా పిల్లలు , పెద్దలు జాగ్రత్త వహిద్దాం.చీకటిని పారద్రోలి ప్రజల జీవితాల్లో వెలుగులు నింపే పండుగ దీపావళి. దీనికి ప్రతీకగా పండుగ రోజున అందరూ దీపాలను వెలిగించి వేడుకలు జరుపుతారు. ప్రత్యేక పూజలు నిర్వహిస్తారు. అటు వంటి ఈ గొప్ప పండుగను కాలుష్య రహితంగా జరుపుకో వడం అన్ని విధాలా శ్రేయస్కరం. బాణసంచా కాల్చడం వల్ల శబ్ద కాలుష్యం, వాయు కాలు ష్యం జరుగుతోంది. వీటిని తగ్గిస్తూ గ్రీన్ దీపావళిని నిర్వహించుకో వాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

**ఎకో ఫ్రెండ్లీ దీవాలి:** పర్యావరణానికి హాని కలిగించని విధంగా దీపావళి పండుగను జరుపుకునేందుకు నేడు ప్రజల్లో క్రమక్ర మంగా ఆసక్తి పెరుగుతోంది. ఈ నేపథ్యంలో ముందుగా మనం బాణసంచాను కాల్చడం వల్ల ప్రకృతికి జరిగే హాని గురించి తెలుసు కోవాలి. క్రాకర్స్‌ను కాల్చడం వల్ల పలు రకాలుగా పర్యావరణంపై హానికలు గుతోంది.

**బాణసంచాతో కాలుష్యం:**

దీపావళి వేడుకల్లో అన్నింటికంటే ముందుగా చెప్పుకోవాల్సింది బాణసంచా కాల్చడం వల్ల జరిగే వాతావరణ కాలుష్యం. దీన్ని దృష్టిలో పెట్టుకొని బాణసంచాను అతి తక్కు వగా కాల్చడం పర్యావరణానికి మేలు చేకూరుస్తుంది. బాణసంచా కంటే ప్రజల జీవి తాలు ముఖ్యమన్న విషయం తెలుసుకోవాలి. పండుగ రోజున వెలుగులు విరజిమ్మే క్రాకర్స్, పెద్దగా శబ్దం చేసే టపాకాయలు కాల్చి చాలా మంది ఆనందం పొందు తారు. కానీ అనాదిగా దీపావళి పండు గను మట్టి దీపాలను వెలిగించి, లక్ష్మీదేవి పూజలు చేసి వేడుకలు జరుపుకునేవారు. అప్పట్లో బాణసంచాను కాల్చడం వంటి వేమీ ఉండేవి కావు. దీంతో వాతావరణ కాలుష్యం అనే సమస్యే ఉండేది కాదు. ప్రధానంగా నగరా లలో క్రాకర్స్‌ను కాల్చడం భారీగా ఉంటోంది. బాణసంచా లోని టాక్సిక్ పదార్థాల వల్ల వాటిని కాల్చి నప్పుడు టాక్సిక్ గ్యాస్‌లు రావడంతో ప్రజల ఆరోగ్యానికి హాని కలుగుతోంది. ఇక టపాకాయలను కాల్చడం వల్ల వచ్చే పెద్ద శబ్దాలు ప్రజలతో పాటు పక్షులు, జంతువులకు సైతం హాని కలుగు తోంది. గుండెపోటు ఉన్నవారికి ఈ శబ్దాలు హానికరంగా మార వచ్చు. దీన్ని దృష్టిలో పెట్టుకొని పెద్ద శబ్దాలు చేసే క్రాకర్స్‌కు దూరంగా ఉండడమే మేలు. టపాకాయల ఫ్యాక్టరీలలో ఎక్కువగా వీటిని పిల్లలు తయారుచేస్తున్నారు. టాక్సిక్ పదార్థాలతో బాణసంచాను తయారు చేయడం వల్ల వారికి పలు ఆరోగ్య సమస్యలు ఎదురె కొందరైతే టీనేజీలోని చనిపోతుండడం విచారకరం.

**ఎకో ఫ్రెండ్‌లీ క్రాకర్స్:**పర్యావరణానికి మేలు చేసే ఎకో ఫ్రెండ్లీ క్రాకర్స్ ప్రజలకు అందుబాటులోకి రావడం విశేషం. దీపావళి పండుగను పురస్కరించుకొని రెండేళ్ల క్రితం తొలిసారిగా మార్కెట్లోకి ఇవి ప్రవేశించాయి. తక్కువ కాలుష్యాన్ని కలిగించడమే కాకుండా పెద్దగా శబ్దాలు చేయని టపాకాయలు ఇవి. తక్కువ ధరల్లో లభించే ఈ క్రాకర్స్ వివిధ రకాల ఆకులను పొందుపరిచి తయారుచేస్తుండడం విశేషం. ప్రస్తుతం ఎకో ఫ్రెండ్లీ క్రాకర్స్ వివిధ రకాలుగా లభ్యమవుతున్నాయి. గత కొన్నిసంవత్సరాలుగా మార్కెట్లోకి వచ్చిన ఈ టపాకాయలకు మంచి డిమాండ్ ఉంది. ప్రారంభంలోనే నాలుగు లక్షల రూపాయల క్రాకర్స్‌ను అమ్మాను.

వెంటనే మరో మూడు లక్షల రూపాయల క్రాకర్స్‌కు ఆర్డర్ వచ్చింది అని ఎకో ఫ్రెండ్లీ క్రాకర్స్ హోల్‌సేలర్ పేర్కొన్నారు. ఈ టపాకాయల్లో ఆకులను పొందుపరుస్తారు. ఫలి తంగా తక్కువ శబ్దాలతో ఇవి పేలుతాయి. ఈ గ్రీన్ ఫైర్‌వర్క్స్ పిల్లలకు సురక్షితంగా ఉం టాయి అని చెప్పారు. తొలిసారిగా మార్కెట్లోకి వచ్చిన ఎకో ఫ్రెండ్లీ క్రాకర్స్ పర్యావరణ కాలుష్యాన్ని తగ్గించేందుకు తోడ్పడుతున్నాయి. దీంతో వీటిని వాడాలని పర్యావరణ ప్రేమికులు ప్రచారాన్ని చేపడుతున్నారు.

**శబ్ద కాలుష్యంతో సమస్యలు:**పెద్దగా శబ్దం చేసే బాణసంచా మూలంగా తీవ్రమైన శబ్ద కాలుష్యం జరుగుతోంది. టపాకా యలు కాల్చినప్పుడు వాటికి నాలుగుమీటర్ల దూరంలో శబ్దం 125 డెసిబుల్స్‌కు మించి ఉండకూడదని చట్టం చెబుతోంది. ఇంతకు మించిన శబ్దాన్ని నిషేధించారు. ఇక బాణసంచా శబ్ద కాలుష్యం వల్ల మనిషిపై ఎంతో ప్రభావం పడుతోంది. పెద్ద శబ్దాల వల్ల వినికిడి సమస్య రావచ్చు. రక్తపోటు పెరగడంతో పాటు గుండెపోటు కూడా వచ్చే అవకాశం ఉంది. నిద్రపోయే వారికి తీవ్ర అంతరాయంగా మారుతుంది. ఒక్కసారిగా పెద్ద శబ్దాలు వినడంతో తాత్కాలికంగానే కాదు పూర్తిగా చెవుడు వచ్చే అవ కాశం ఉందని డాక్టర్లు చెబుతున్నారు.

> **పెరుగుతున్న మోత**
>
> నగరంలో దీపావళి మోత ఏయేటి కాయేడు పెరుగుతూనే ఉంది. పొల్యూషన్ కంట్రోల్ బోర్డు లెక్కల ప్రకారం 2015 దీపావళి బాణసంచా నేపథ్యం లో శబ్దతీవ్రత 80డెసిబుళ్లు. అబిడ్స్ ప్రాంతంలో 75 నుంచి 83 డెసిబుళ్లకిపెరిగింది. పంజా గుట్టలో 80 నుంచి 83 డెసిబు ళ్లు శబ్ధ తీవ్రత నమోదైంది. ప్రగతినగర్‌లో మరీ ఎక్కువగా 52 నుంచి 79.4 డెసిబుళ్ల శబ్దకాలుష్యం పెరిగింది.

**బహుమతులు ఇచ్చిపుచ్చుకునే పండుగ:**బహుమతులు ఇచ్చిపుచ్చుకోవడం అన్నది ఇతర దేశాల్లోనే కాదు మనదే శంలో కూడా ఉన్న సాంప్రదయకరమెన పద్ధతి. ఇచ్చువు చ్చుకొనే సందర్భం ఇప్పుడు రానే వచ్చింది. సాధారణంగా సందర్భాన్ని బట్టి మాత్రమే బహుమతలును తీసుకెళుతుం టారు చాలా మంది. అయితే ఈ దీపావళికి చాలా మంది బహుమతులు ఇచ్చిపుచ్చుకుంటారు. బహుమతులు ఇచ్చుపుచ్చుకోవడమనేది దీపావళి ప్రత్యేకతే. ఈ దీపావళి రోజు మాత్రం, బహుమతులు చేతిలో లేకుండా ఏ ఇంటికీ వెళ్ళలేము. ముఖ్యంగా పిల్లలు మరియు వయస్సైన వారు ఉన్న ఇళ్ళకు, గిఫ్ట్ లేకుండా వెళ్లాలంటే మరీ మొహమాటం ఎక్కువ. బహుమతులు కుటుంబ సభ్యులకు, స్నేహితులకు ఇచ్చిపుచ్చుకోవడానికి దీపావళి ఒక సందర్భం. చాలా మంది దీపావళికి బహుమతులను పంచుతుంటారు. అయితే దీపావళికి ఎటువంటి బహుమతులను ఇవ్వా లి, ఎటువంటి బహుమతులను ఇవ్వకూడదనేది చాలా మందికి తెలిసిండకపోవచ్చు.

> **ఆస్తమా పెంచే పండుగ**
>
> దీపావళి వేళ కాల్చే మందులు వల్ల ఆస్తమా లాంటి రోగాలు బారిన పడే అవకాశం చిన్నారులకు అధికంగా ఉంటుంది. గర్భిణీ స్త్రీలపై కూడా ఇది తీవ్ర ప్రభావమే చూవు తుంది సంప్రదాయ రీతిలో దీపాలు వెలి గించి, స్వీటులు పంచుకోవటం వరకూ ఓకే కానీ అధిక శబ్దాలు, కాలుష్యం వెదజల్లే టపాసులు కాల్చటం వల్ల చెవి, గొంతు సమస్యలు రావటంతో పాటుగా హార్ట్ పేషంట్లకు బిపీ పెరగటం, టపాసులు కాల్చిన చేతులను పొరపాటున కళ్లలో పెట్టుకోవటం వల్ల కళ్లు దెబ్బతినటం లాంటి సమస్యలెన్నో వస్తాయని హెచ్చరిస్తున్నారు ఆరోగ్య నిపుణులు.

అయితే దీపావళికి ఇచ్చుకొన్ని బహుమతులు కొన్ని ప్రత్యేకంగా ఉన్నాయి. అందుకు ఈ సీజన్‌లో చాలా మంది బహుమతుల కోసం బయట మార్కెట్లో సందడి సందడిగా ఉం టుంది. బహుమతులు ఎంపిక చేసుకోవడంలో వివిధరకాలుగా ఉన్నాయి. బహుమ తులను ఇవ్వాలనుకొన్న ప్పుడు చాయిస్ వారి స్త్రీ పురుషులక ప్రత్యేకంగా, వయ స్సును బట్టి కూడా ఉంటాయి. దీపావళి రోజున అందరూ సంతోషంగా గడపడం కోసమే చాలా మంది బహుమతులు ఇస్తుంటారు. కాబట్టి బహుమతులు ఎటువంటి వాటిని ఎంపిక చేసుకోవాలి అని కొన్ని అద్భుతమెన బహుమతుల లిస్ట్‌ను ఇక్కడ తయారుచేశాము. అయితే బహుమతులు ఇచ్చేటప్పుడు అది మీ బడ్జెట్ కు సరిపోయే విధంగా ఉండాలి...

**పెరుగుతున్న మోత** నగరంలో దీపావళి మోత ఏయేటి కాయేడు పెరుగుతూనే ఉంది. పొల్యూషన్ కంట్రోల్ బోర్డు లెక్కల ప్రకారం 2015 దీపావళి బాణసంచా నేపథ్యం లో శబ్దతీవ్రత 80డెసిబుళ్లు. అబిడ్స్ ప్రాంతంలో 75 నుంచి 83 డెసిబుళ్లకిపెరిగింది. పంజా గుట్టలో 80 నుంచి 83 డెసిబు ళ్లు శబ్ధ తీవ్రత నమోదైంది. ప్రగతినగర్‌లో మరీ ఎక్కువగా 52 నుంచి 79.4 డెసిబుళ్ల శబ్దకాలుష్యం పెరిగింది. ఉప్ప ల్ 69 నుంచి 79 డెసిబుళ్ల కి ఎగబాకింది. మునుపెన్నడూ లేని విధంగా నిరుడు కంటే గతేడాది నగరంలోని మొత్తం గా 3డెసిబుళ్ల శబ్దకాలుష్యం పెరిగినట్లు కాలుష్యనియంత్రణ సంస్థ గణాంకాలు తెలిపాయి.

**ఆరోగ్య సమస్యలు:**క్రాకర్స్‌లోని కెమికల్స్ మూలంగా ప్రజల ఆరోగ్యానికి ముప్పు ఏర్పడుతోంది. వీటిలోని కెమికల్స్ వివిధ ఆరోగ్య సమస్యలను సృష్టిస్తున్నాయి.

**కెమికల్:** ఆరో గ్య సమస్య
**కాపర్:** శ్యాస కోశ సమస్యలు ఏర్పడతాయి
**క్యాడ్మియం:** అ నీమియాకు దారితీయవచ్చు. కిడ్నీ దెబ్బతి నవచ్చు.
**లెడ్:** నరాల వ్య వస్థపై ప్రభావం చూపుతుంది.
**మెగ్నీషియం:** పొగ రూపంలోని మెగ్నీషియం వాతావర ణంలో కలిసిపోయి ప్రజలకు చర్మ సంబంధిత సమస్యలను సృష్టిస్తుంది.
**జింక్ :** వాంతులు వచ్చే అవకాశాలు ఉంటాయి
**నెట్రేట్:** మానసిక సమస్యలకు దారితీయవచ్చు
**నెట్రేట్:** కోమాలోకి వెళ్లే అవకాశం ఉంది.

పండగ ఆనందం డబ్బులతో కొని తెచ్చుకునే కాలుష్యం కార ణంగా పూర్తిగా హరించుకుపోతోంది. దీపావళి సమయంలో 6-10 శాతం కాలుష్యస్థాయి పెరుగుతుంది. నైట్రస్ ఆక్సైడ్, సల్ఫర్ డై ఆక్సైడ్ స్థాయి ప్రమాదర స్థాయిలో పెరుగుతుందనేది కాలుష్య నియంత్రణ మండలితో పాటుగా పలు స్వచ్ఛంద సంస్థల నివేదికలు చెబుతున్నాయి. ఇదివరకటి కంటే పెరిగిన టపాకాయల వినియోగం వళ్ళ ఈ రెండు రోజుల్లోనూ విష వాయువులు ప్రమాదకర స్థాయిలో వెలువడుతున్నయి.

# వింతలు- విడ్డూరాలు



మిక్కీమౌస్, మిన్నీమౌస్ పాత్రలకు తమ గొంతు అరువిచ్చిన డబ్బింగ్ కళాకారులిద్దరూ నిజజీవితంలోనూ పెళ్లిచేసుకున్నారు.

సూర్యుణ్ని చుట్టొచ్చే క్రమంలో భూమి రోజుకు 15లక్షల మైళ్లు ప్రయాణిస్తుంది.





మగవాళ్లను Dude అంటే ఆడవాళ్లను Dudine అనాలట!



## మరుగుజ్జు పిల్లి



ప్రపంచవ్యాప్తంగా ఉన్న 5 కోట్ల పిల్లుల్లో ఫిజ్‌గర్ల్ అనే పిల్లి మరుగుజ్జు పిల్లి. అమెరికాలోని కాలిఫోర్నియాలో ఉంది. ఇది కేవలం ఆరు అంగుళాల పొడవు. రెండు కిలోల బరువుంటుంది. గిన్నీస్ రికార్డులో స్థానం సంపాదించుకుంది. ఈ పిల్లి జాతిని ముంచికిన్ క్యాట్ అంటారు.

Dwarf Cat - మరుగుజ్జు పిల్లి






జ్ఞానేంద్రియాల్లో చెవులు చాలా చురుగ్గా పనిచేస్తాయి. 0.05 సెకనులో శబ్దాన్ని గ్రహించగలవు.

Ears are more sensitive among all the Sense-organs






భూమి ఒక్క పౌండు ఆహారాన్ని అందించడానికి వంద పౌండ్ల వర్షపు నీటిని తీసుకుంటుంది.



డిస్నీవాళ్లు తీసిన సినిమాల్లో ఇంతవరకూ సృష్టించిన యువరాణి పాత్రల సంఖ్య 9. వాటి పేర్లు వరసగా... జాస్మిన్, స్నోవైట్, ఫాములాన్, అరోరా, సిండ్రెల్లా, పోకహోంటాస్, టియానా, బెల్లే, ఏరియల్.




గ్రీన్ అనకొండ పెద్ద జంతువును వేటాడి తిన్నాక దాదాపు నెలరోజులు ఆహారం తీసుకోదు!






తనకంటే ఉన్నత స్థాయి వ్యక్తిని వివాహ మాడడమంటే తన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను అమ్ముకోవడమే. -మాసింజర్

కథ

# పరిష్కారం

ఏమని ఋతుపవనాలు అలా అడుగుపెట్టాయోగాని – నీలి రంగులో ఉన్న ఆకాశం ఏదో మంత్రం వేసినట్టుగా మేఘాలతో తెలుపురంగులో వెండితెరలా మారిపోయింది. నిన్నా మొన్నటి వరకూ ఎండవేడితో విషం చిమ్ముతున్న కాలనాగులా భయపడించిన సూర్యుడు ఇప్పుడు కిడ్నాప్ కాబడినట్టు మేఘాల వెనుక ఎక్కడున్నాడో తెలియన పరిస్థితి... శీతల సమీరాలు ఒయ్యారాలతో ఊగిసలాడుతూ వస్తున్నట్టుగా చల్లగా మారిపోయింది వాతావరణమంతా, ఆ చల్లని వాతావరణాన్ని సిటీలోని జనమంతా హాయిగా ఆస్వాదిస్తున్నారు.

కాని గిరిధర్‌కు మాత్రం ఆ ఆహ్లాదం ఎంతమాత్రం ఆనందాన్ని తెప్పించడం లేదు! నరం నొప్పితో ఏడ్చేవాడికి కనక కంకణం తొడిగితే మాత్రం ఆ ఏడ్పు తగ్గుతుందా... అన్నట్టు అతని మనసులో చెలరేగుతున్న సెగలకు ఈ సమీరాల అనుభూతి ఎంత మాత్రం ప్రభావం చూపటం లేదు.

నిన్న మొన్నటి వరకూ ఆ సూర్యభగవానుడు దేదీవ్యమానంగా వెలిగిపోయాడు. నేడు మాత్రం కారు మబ్బుల్లో కూరుకుపోయాడు. అంటే ఏది ఎవ్వరికీ శాశ్వతం కాదన్న ధర్మం ప్రకృతిలోనే ఇమిడి ఉందన్న మాట! అలాంటిది మన మనషుల్లో జరగడం పెద్ద వింత కాదేమో!

గిరిధర్ ఓ పల్లెటూరి నుండి హైదరాబాద్‌కు ఉద్యోగరీత్యా వచ్చి సెటిలయ్యాడు. అప్పట్లో పల్లెలో ఉన్నా ముందు జాగ్రత్తగా కంప్యూటర్ రంగంలో కొన్ని కోర్సులు పూర్తి చేశాడు. మొత్తానికి తాను అనుకున్న విధంగా ఓ సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ కాగలిగాడు. నెలకి నలభైవేలు జీతం పొందుతూ మంచి స్థాయిలోనే వెలిగిపోతున్నాడు.

ఉద్యోగంలో చేరిన కొత్తలో తన ఘనవిజయాన్ని చాటి చెప్పాలని తన పల్లెను సందర్శించాడు. అప్పట్లో తన ఉద్యోగం, జీతం గురించి చెప్పగానే అందరూ ఒక్కసారిగా ముక్కనవేలేసుకున్నారు.

అతని బంధుమిత్రులంతా అకాశం నుండి ఊడిపడ్డ మెరుపు తీగలా వింతగా చూశారు. అందరూ చూపిస్తున్న గౌరవం, అభిమానం ఆశ్చర్యాల తాకిడికి గిరిధర్ మనసు ఆకాశగంగను రుచి చూసినట్టయింది.

గిరిధర్ చదువుకునే రోజుల్లో కొంతమంది స్నేహితులు అతన్ని చాలా చులకనగా చూసేవారు. అలాంటి వారికి మంచి ఫ్యూచర్‌తో తగిన సమాధానం చెప్పాలనే కసిని అంతర్లీనంగా పెంచుకున్నాడు అప్పట్లోనే. ఎంతో కాలంగా ఎదురు చూస్తూన్న ఈ దివ్యమైన అవకాశం ఎటూ వచ్చింది కాబట్టి ఇక తన ప్రతాపం చూపించడం మొదలు పెట్టాడు.

తన మిత్రుడైన మురళి లోలోపల బాధపడుతూ పైకి మాత్రం రాజకీయ దరహాసాన్ని చూపిస్తూ "ఒరే... గిరిధర్! మొత్తానికి మన పల్లెలో ఎవ్వరూ ఎదగనంత స్థాయికి వచ్చావు. నీ స్నేహితుడిగా నాకు చాలా గర్వంగా వుంది" అభినందిస్తూ అన్నాడు.

"సుబ్బలక్ష్మి గారు! ఇలాంటి అనుకోని పరిస్థితులు మనుషులకు కాకుంటే కొండలకు, గుట్టలకు వస్తాయా? మనం ఇలాంటి సమయంలో బాధపడి ఏడ్వటం మామూలే! అలా అని మీరు మరీ చిన్న పిల్లలా గుండెలకు బాదుకుంటుంటే మీకేదైనా జరగ రానిదేదైనా జరిగితే మీ పిల్లలేం కావాలి? మన ప్రమేయం లేకుండా జరిగే విపత్తులను చూసి ఏడుస్తూ మనం సాధించగలిగేది ఏమి ఉండదు. ముందు విశ్వం గారిని రక్షించుకోవడమెలాగో ఆలోచించండి! విధిరాతను కాదని ఎవ్వరం ఏమీ చెయ్యలేం... అందువల్ల జరిగిన సంఘటనను చూసి కుమిలిపోతూ లేని సమస్యను తెచ్చుకోవటం మంచిదికాదు. మీరు కాస్త ధైర్యంగా ఉంటే మంచిది" తనకు తోచిన విధంగా సలహా ఇచ్చాడు గిరిధర్.

పైకి నాటకీయంగా అభినందిస్తున్నా, మురళిలోని అంతర్గతం ఏమిటో గిరిధర్‌కు తెలియంది కాదు. అందుకే మురళిని మరింత కృంగదీయాలని "నలభైవేల జీతం కేవలం ఈ రెండు మసాలు మాత్రమే! తర్వాత మరో కంపెనీలో చేరితే ఇంతకు రెండితలు పెరుగుతుంది" ఎంతో కేజువల్‌గా చెప్పాడు. అసలే షుగర్ వ్యాధితో నలిగిపోతున్న వాడి నోట్లో గుప్పెడు చక్కె పోసినట్టుగా ఖంగుతిన్నాడు మురళి. ఏడ్పునే నవ్వుగా మార్చి మరింతగా గిరిధర్‌ను అభినందించాడు. ఇలా ఒక్క మురళినే కాదు – తన బంధువుల్లో చాలామందికి ఇలాగే ట్రీట్‌మెంట్ ఇచ్చాడు గిరిధర్ అప్పట్లో. అదేం వింతమాయరోగమో గాని ఉన్నట్టుండి ఆర్థిక మాంధ్యం స్వైన్‌ఫ్లూలా అన్నిదేశాలకూ శరవేగంగా ఎగబాకడంతో అందరికీ కారు మబ్బులు కమ్ముకున్నాయ్. తన లాంటి ఉద్యోగులంతా తుస్సుమని తొలగించబడ్డారు.

ఎండాకాలంలో బాగా గిరాకీ ఉన్న కూల్‌డ్రింక్స్ బాటిల్స్ వర్షాకాలం రాకతో మూలన పడ్డట్టుగా గిరిధర్ లాంటి వారంతా రోడ్డున పడ్డారు. ఇప్పటికిప్పుడు మరో ప్రత్యామ్నాయం కోసం వెతికితే ఓ పదివేల వరకు మాత్రమే ఇస్తామంటున్నారు.

త్వరలో ఎనభైవేలు దాకా సంపాదిస్తానని కలలు కన్న గిరిధర్ ఉన్నట్టుండి ఇంత తక్కువ సంపాదనకు పని చేయాలంటే జీర్ణించుకోలేకపోతున్నాడు. ఇప్పుడు తన వాళ్ళకు ఎలా చెప్పాలి? ఒకవేళ చెప్పకుండా దాచేద్దామా అంతే ఇలా ఎంతకాలం దాచగలం?? ఇలాంటి బాధాకరమైన ఆలోచనలతో పంచాగ్ని మధ్యస్థుడిలా ఆలోచిస్తూ నడుస్తున్నాడు గిరిధర్. ఆ ప్రయత్నంగానే ఓ క్యాంటిన్‌కు వెళ్ళి కూర్చుని "ఓ కాఫీ..." చెప్పాడతను. మరుక్షణంలోనే తన టేబుల్‌మీదకు కాఫీ వస్తుందని ఎదురు చూస్తున్న గిరిధర్‌ని చూసి అక్కడున్న వారంతా ఫక్కున నవ్వారు. గిరిధర్ వెంటనే తలెత్తి వారి వంక చూశాడు. గిరిధర్‌కు అప్పుడు అర్థమైంది, అది క్యాంటిన్ కాదని – మందుబాబులు కూర్చున్న ఓ బార్ అన్న విషయం.

పుండుమీద కారం పోసినట్టు చరచరమని మండిపోయింది గిరిధర్‌కు. ఆలోచనలు పరధ్యానంలో తాను చేసిన ఈ పొరపాటుతో ఎవరినీ ఏమీ అక్కడి నుండి బయటకు వచ్చాడు.

ఇలాంటి పిచ్చి ఆలోచనలతో ఎక్కువగా తిరగటం మంచిది కాదనుకున్న గిరిధర్ మెల్లిగా తన రూం దగ్గరికి వస్తుండగా ఆ వీధిలో కొంతమంది జనం నిలుచుకొని ఏదో మాట్లాడుకోవడం గమనించి వేగంగా వారి దగ్గరికెళ్ళి ఏంజరిగిందో విచారించాడు.

తన రూంకు కాస్త దగ్గరల్లో తనకు పరిచయమున్న విశ్వంగారు గుండెపోటుకు గురై హాస్పిటల్‌లో చేర్చారన్న సంగతి తెలిసింది.

ఉన్న ఉద్యోగం ఊడిపోయి ఏడుస్తున్న తనకు రావలసిన గుండెపోటు ఇతగాడికెందుకొచ్చిందాని ఎకసెక్కెంగా మనసులో అనుకొని విశ్వంగారిని చూడటానికి హాస్పిటల్‌కు బయల్దేరాడు గిరిధర్. హాస్పిటల్‌కు వెళ్ళగానే విశ్వంగారి భార్య గొల్లున ఏడుస్తోంది. ఆమెను అందరూ ఓదారుస్తున్నారు. ఎంత ఓదార్చినా ఆమె ఏడ్పు ఎంతకీ ఆగడం లేదు. ప్రస్తుతానికి విశ్వం డాక్టర్ల అబ్జర్వేషన్‌లో ఉన్నాడని, పరిస్థితి కాస్త సీరియస్‌గానే ఉందన్న విషయం తెలిసింది.

అక్కడున్న ఓ వ్యక్తి గిరిధర్‌ను చూసి "బాబూ! సుబ్బలక్ష్మిని ఓదార్చటం ఎవరి వల్లా కావడంలేదు. నీవల్ల అవుతుందేమో ఓసారి ఆమెను ఓదార్చకూడదా?" చిన్నగా రిక్వెస్ట్ చేసుకున్నాడు.

అమెను ఓదార్చటం ఎవరివల్లవుతుందాన్న సంగతి పక్కన పెడితే ప్రతి ఒక్కరూ మానవీయకోణంలో ఎవరి ప్రయత్నం వారు చేస్తే తప్పులేదనిపించిన గిరిధర్ నెమ్మదిగా సుబ్బలక్ష్మి దగ్గరకు వచ్చాడు.

"సుబ్బలక్ష్మి గారు! ఇలాంటి అనుకోని పరిస్థితులు మనుషులకు కాకుంటే కొండలకు, గుట్టలకు వస్తాయా? మనం ఇలాంటి సమయంలో బాధపడి ఏడ్వటం మామూలే! అలా అని మీరు మరీ చిన్న పిల్లలా గుండెలకు బాదుకుంటుంటే మీకేదైనా జరగ రానిదేదైనా జరిగితే మీ పిల్లలేం కావాలి? మన ప్రమేయం లేకుండా జరిగే విపత్తులను చూసి ఏడుస్తూ మనం సాధించగలిగేది ఏమి ఉండదు. ముందు విశ్వం గారిని రక్షించుకోవడమెలాగో ఆలోచించండి! విధిరాతను కాదని ఎవ్వరం ఏమీ చెయ్యలేం... అందువల్ల జరిగిన సంఘటనను చూసి కుమిలిపోతూ లేని సమస్యను తెచ్చుకోవటం మంచిదికాదు. మీరు కాస్త ధైర్యంగా ఉంటే మంచిది" తనకు తోచిన విధంగా సలహా ఇచ్చాడు గిరిధర్.

అతని సలహాను విన్న వారంతా ఎంతో ఆశ్చర్యంగా చూశారు ప్రస్తుత పరిస్థితిలో అతను చెప్పిందే నిజమని గొంతుకలిపారు.

వెనుదిరిగిన మరుక్షణంలోనే సుబ్బలక్ష్మి గారికి ఇచ్చిన సలహా సారాంశం గిరిధర్ మస్తిష్కంలో పదే పదే భ్రమణం చెందుతూ తిరిగి అతన్నే ఆలోచించేలా చేసింది.

తన రూంకు కాస్త దగ్గరల్లో తనకు పరిచయమున్న విశ్వంగారు గుండెపోటుకు గురై హాస్పిటల్‌లో చేర్చారన్న సంగతి తెలిసింది. ఉన్న ఉద్యోగం ఊడిపోయి ఏడుస్తున్న తనకు రావలసిన గుండెపోటు ఇతగాడికెందుకొచ్చిందాని ఎకసెక్కెంగా మనసులో అనుకొని విశ్వంగారిని చూడటానికి హాస్పిటల్‌కు బయల్దేరాడు గిరిధర్. హాస్పిటల్‌కు వెళ్ళగానే విశ్వంగారి భార్య గొల్లున ఏడుస్తోంది. ఆమెను అందరూ ఓదారుస్తున్నారు. ఎంత ఓదార్చినా ఆమె ఏడ్పు ఎంతకీ ఆగడం లేదు.

అమెకయితే సలహా గొప్పగా ఇచ్చానుగాని – ఇప్పుడు నేను చేస్తున్నదేంటి? పోయిన ఉద్యోగం గురించి ఆలోచిస్తూ – ఉన్న చిన్నపాటి ఉద్యోగాన్ని చేయకపోవడం సుబ్బలక్ష్మిగారి ఏడ్పులా లేదా? అమెకు సలహాఇవ్వడం నేను పాటించకపోవడం తప్పుకాదా? కలలు కంటూ కాలాన్ని వృధా చేయడం కన్నా వచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవటం మంచిదికాదా?

ఎవ్వరికీ ఏదీ శాశ్వతం కాదని – అందుబాటులో ఉన్నదే ఏంతో గొప్పదని స్వీకరించటం మన మానవ ధర్మం కదా! ఈ సత్యం మస్తిష్కంలో మెదిలిన వెంటనే అందుబాటులో ఉన్న ఉద్యాగాల వేటలో పడ్డాడు గిరిధర్.

– ముడ్లపేట రమేష్‌బాబు,

*బెంగుళూరు, సెల్: 09035301175*

# సూర్య బుడత



## ఎప్పటిలాగే రూ 200 లాభం రావాలంటే.

సుబ్బయ్య హోటల్ లో ప్లేటు ఇడ్లీ రూ 20, దోశ రూ 25, ప్లేటు ఉప్మా రూ 22 కు అమ్ముతాడు, అతడికి 10 పేట్ల ఇడ్లీ, 8 దోశలు, 7 పేట్ల ఉప్మా, అమ్మగా రూ 200 లాభం వచ్చేది. ఇప్పుడు పప్పులు,నూనె, గ్యాస్, రేట్లు పెరగటం వల్ల 91 రూపాయలే వస్తోంది. రేట్లు పెంచ కుండా ఎప్పటిలాగే రూ 200 లాభం రావాలంటే. అదే పిండిని ఉపయోగించి ఎన్ని ప్లేట్ల ఇడ్లీ, ఎన్ని దోశలు, ఎన్ని పేట్ల ఉప్మాగా చెయ్యాలి?

జవాబులు :::::: అదే పిండి తో 12 ప్లేట్ల ఇడ్లీ, 9 దోశలు,9 ప్లేటు ఉప్మాగా చెయ్యాలి( 220 +125 + 222 =రూ 109)

# సైకిలు చరిత్ర



బొమ్మలో కనిపించే రెండు చక్రాల సైకిలు 1818 నాటిది. అది చూడడానికి ప్రస్తుతం వాడుకలో ఉన్న సైకిలు మాదిరిగానే ఉంది. కానీ గమనిస్తే తేడాలు కనబడతాయి. జెర్మనీలో రాజకుటుంబానికి చెందిన కార్ల్ క్రిస్టియన్ లుడ్విష్ ఈ సైకిల్‌కు రూపం పోశాడు.

1812లో వర్షాలు కురవలేదు. వాతావరణం బాగుండలేదు. ఓట్స్ పంట దెబ్బతిన్నది. అంటే గుర్రాలకు తిండిలేకుండా పోయింది. మరి గుర్రం లేకుండా తిరగడం ఎట్లా అని కార్ల్ ఆలోచన చేశాడు. అతనొక నాలుగు చక్రాల బండిని తయారు చేశాడు. దాన్ని కాంగ్రెస్ ఆఫ్ వియెన్నా ముందు ప్రదర్శిం చాడు. దాన్ని ఎవరూ పట్టించుకున్నట్టు లేదు. 1815లో ఇండొనేషియాలో తంబోరా అగ్నిపర్వతం పేలింది. యూరప్ వాతావరణం మంచు మయమయింది. మళ్లీ ఓట్స్ కరువు వచ్చింది. మళ్లీ కార్ల్ రంగంలోకి దిగాడు.



ఈసారి అతను రెండు చక్రాల సైకిలును తయారు చేశాడు. ముందు చక్రం దారి తీస్తుంది. వెనుక చక్రం వెంట వస్తుంది. ఈ నాటికీ, సైకిల్స్, మోటార్ సైకిల్స్ అన్నీ ఇదే పద్ధతిలో పనిచేస్తుండడం గమనించదగిన అంశం. అయితే కార్ల్ సైకిల్‌కు చైను లేదు. పెడల్స్ అంతకన్నా లేవు. స్కూటర్‌ను తోసినట్లు సైకిలును కాళ్లతో నేలను తాటిస్తూ ముందుకు నడిపించాలి. ఆపడానికి కూడా కాళ్ళనే వాడాలి. జెర్మన్‌లో దీనికి లేఫ్ మిషన్ అని పేరుపెట్టారు. అంటే పరుగెత్తే యంత్రం. 1817 జూన్ 12న ఈ యంత్రం సాయంతో గంటకు 9 మైళ్ళు ప్రయాణం వీలయింది. కార్ల్ తన యంత్రాన్ని మరుసటి సంవత్సరం పేటెంట్ చేశాడు. కానీ ఓట్స్ ధరలు పడిపోవడంతో ఎవరూ ఈ సైకిలు సంగతి పట్టించుకోలేదు. అసలు ఈ సైకిలు వాడి, అపరాధ సుంకం కట్టిన వారూ ఉన్నారట. ఈ సైకిలు నడవాలంటే నునువుగా వేసిన రోడ్ ఉండాలి. అప్పట్లో రోడ్లు లేవు మరి. పైగా ఏ కొంచెం పట్టు తప్పినా అది అడ్డంగా పడిపోతుంది. కాళ్ళతో నడపాలి గనుక, వేసుకున్న జోళ్ళు త్వరగా పాడవు తాయి. అన్నిటికీ మించి అదే కాలంలో రైళ్లు పోటీగా వచ్చాయి. చివరకు ఈ మర గుర్రం రాజకుటుంబ బాల యువకులకు ఆటవస్తు వుగా మిగిలింది. ఇంగ్లీషులో దీన్ని హాబీ హార్స్ అని పిలిచారు. దాని ముందు గుర్రాలు, ఏనుగులు, డ్రాగన్‌ల తలలను అమర్చుకునే వారు కూడా!

రాజరికాన్ని వదులుకున్న కార్ల్ 1951లో చనిపో యాడు. 1861లో ఆర్నెస్ట్ అనే ఫ్రెంచి వ్యక్తి సైకిలు కు పెడల్స్ అమర్చాడు. తరువాత బ్రేకులు పెట్టాడు. 1869లో ముందు చక్రం పెద్దదిగా ఉండే సైకిలు వచ్చింది. 1879లో సైకిలుకు చైను తోడ యింది. 1885లో గాన్‌లీబ్ జెయిమ్లర్ దీనికి ఇంజన్‌ను అమర్చడంతో మోటార్‌సైకిల్ పుట్టుకు వచ్చింది.

## దారిని చూపండి




## తేడాలు గుర్తించండి



## రంగులు వేయండి

## చుక్కలు కలపండి






సంకుచితమైన మనస్తత్వం కలవారు ఎదుటి మనుషులను గురించి ఆలోచిస్తే, సగటు మనస్తత్వం గలవారు వివిధ సంఘటనలను గురించి ఆలోచిస్తారు. అదే ఉన్నతమైన మనస్తత్వం కలవాడు బుద్ధికుశలతను గురించి ఆలోచిస్తారు. -జిడ్డు కృష్ణమూర్తి

## వాత్సాయన

# శృంగార విజ్ఞానం ఎంత?

మీడియాలో ఎక్కడ చూసినా సెక్సు కనపడుతుంది. మీచుట్టు పక్కలు పరిశీలించండి. జనం మాట్లా డేది, గమనించేది, ఆలోచించేది అంతా సెక్సు మయం. చిన్నపాటి, మెసేజ్‌లు, ప్రకటనలు లేదా సినిమాలు, ఏవైనప్పటికి ప్రజలు వారి సెక్సు భావాలనే గుప్పిస్తున్నారు. శాటిలైట్ టెలివిజన్, ఇంటర్నెట్, చివరకు ప్రపంచీకరణలు వీటితో సెక్సు తీవ్ర ప్రచారానికి గురవుతోంది. ఆధునిక పరికరాలకు మనమంతా థ్యాంక్స్ చెప్పాల్సిందే!

గతంలో సాధారణంగా ప్రతివారూ కూడా తమ బంధు త్వాలకు, వ్యాపారాలకు లేదంటే మతపర కార్య క్రమా ల కు, విధులకు పరిమితమయ్యేవారు. కాని ఇపుడు చాలా మంది మనోభావాలలో ముందుగా వచ్చేది సెక్స్ పరమైన ఆలోచనలే. అందుకు కారణం ఒకవైపు మీడియా, మరోవైపు ఇంటర్నెట్ సాధనాలని చెప్పవచ్చు. గతంలో సెక్స్ అనేది సబ్ కాన్షస్ మైండ్‌లో వుండగా, నేడది కాన్షస్ మైండ్‌కు చేర్చబడింది అంటారు చాలా మంది సెక్సాలజిస్టు లు. టీవీల్లో ఏ ఛానెల్ చూసినప్పటికి లేదా ఏ ప్రకటన చూసినా, లేదా హిందీ సినిమాలు చూసినా ఎంతో కొంత సెక్సు శాతం కనపడుతుంటుంది. ప్రత్యేకించి ప్రకటనలు తయారు చేసే కంపెనీలు ప్రకటన ఏదైనప్పటికి, చేతి రిస్టు వాచి కాని లేదా పురుషుడి అండర్ గార్మెంట్ గానీ తమ కంటెంట్లో ఒకే రకమైన భావాలను చొప్పిస్తున్నాయి. ప్రకటన దారులకు ఒకటే ధ్యేయం. తమ ప్రోడక్టును వీలైనంత గ్లామరస్‌గా చూపి కొనుగోళ్ళు పొందటమే. ప్రకటనలు చూస్తుంటే, ఇక వేరే కొత్త తరహా ఆలోచనలు కూడా చూసేవారికి రావటం లేదు. సింగల్‌గా వుండే వారు మేరేజ్ వరకు ఆగలేకపో తున్నారు. పెళ్ళైన వారు వారు చేయాలనుకున్న దానికంటే అధికంగా చేసుకుంటు న్నారు. ఇక గేలు, స్వలింగ సంపర్కులు కొత్త తరహా సెక్సు విధానాలకు ప్రయత్నం చేస్తున్నారు. ఈ రకంగా భారతీయులు ఇదివరలో కంటే ఇపుడు మరింత ఆసక్తిక రంగాను, సౌకర్యవంతంగాను సెక్సును అనుభవిస్తు న్నారు. ఇపుడు సెక్స్ అనే పదాన్ని స్వేచ్ఛగా ఉపయోగిస్తు న్నారు. గతంలో ఈ పదం మాట్లాడితే, బ్యాడ్ క్యారెక్టర్ లేదా అతి చొరవ, లేదా విప్లవ కారుడు అని కూడా అనే వారు. సెక్స్ గురించి మాట్లాడరాదని నీతులు చెపితే, సగానికిపైగా జనం వారిని చెడుగా చూస్తున్నారు.

అంతే కాదు, కొత్త రకం వైబ్రేటింగ్ కండోమ్‌ల సెక్సు బొమ్మల కొరకు, ఇంటర్నెట్ ఛాట్ రూమ్‌లకు మరింత కృషి చేస్తున్నారు. సోషల్ నెట్ వర్కింగ్ వెబ్ సైట్లలో సింగిల్స్, మ్యారీడ్ యువతులు రెచ్చిపోయి జవాబులిచ్చేస్తున్నారట! దేశంలోని ప్రతి ప్రాంతంలోనూ ఇదే వరస కాగా, దీనిని ఒక సెక్స్ విప్లవంగా కూడా కొంతమంది అభివర్ణిస్తున్నారు. అయితే, ఏ విప్లవంలో అయినా సరే, వ్యతిరేకులుకూడా ఉంటూనే వుంటారు. ప్రజలు సైతం చాలావరకు పరిస్థితులను బట్టి నడుచుకుం టూనే వున్నారు. అయితే, నీతులు చెప్పే వారే ఇపుడు ఇది కామసూత్రాలను నేర్పిన దేశమని, వైబ్రేటింగ్ కండోమ్స్ కూడా వచ్చిన ఈ కాలంలో మరింత ముందుకు పోవాలని విచ్చలవిడి కూడా చేయటం జరుగుతోంది. ఖచ్చితంగా చెప్పాలంటే, ఈ నీతులు చెప్పే వారందరూ ఇండియాలో మొదటి సారిగా చట్టబద్ధం చేయబడిన సెక్స్ టాయ్ వైబ్రేటింగ్ కండోమ్ తో పూర్తిగా మారిపోయారు. నేటికి, అందాల నటి శిల్పా శెట్టి బుగ్గలపై ఒక ఎయిడ్స్ అవగాహనా ప్రోగ్రామ్‌లో రిచర్డ్ గెరె పెట్టిన ముద్దులు, ఆమె ఆమోదాలు ఎవరు మరచిపోగలరు?

భారత దేశం ప్రపంచంలో ఎయిడ్స్ రోగ వ్యాపిత దేశా లలో మూడవదిగా వుంది. ఇకనైనా ఈ రకం విచ్చలవిడి అరికట్టాలి. సెక్స్ అంటూ పాకులాడే వారంతా తమ ఎనర్జీలను నిర్మాణాత్మక అంశాలకు మళ్ళించాలి. మన కుటుంబాలలో పిల్లలు అనుకరణల పేరుతో వెర్రి తలలు వేస్తుంటే చూస్తూ ఊరుకుంటామా? సెక్సు అంశాన్ని సరైన రీతిలో వినియోగించే భాధ్యత సమాజంలో కొరవడింది. సెక్స్‌ను తేలికగా తీసుకుంటున్నాం. ఫలితం స్కూలు విద్యార్థులు ఆ చెడు ప్రభావాలకు లోనవుతున్నారు. స్కూలు విద్యార్థులనే కాదు సమాజంలోని అన్ని వర్గాలకు విపరీత సెక్సు చేరిపోతోంది. మరో ఉదాహరణ, ఏనాటి కానాడు మీడియా హాట్ బెడ్ గా పరిగణించే కార్పొరేట్ రంగంలోని బీపీఓ సంస్కృతి. అధిక జీతాలు, రాత్రిపూట ఉద్యోగాలు యువత ను మానసిక రోగులను చేసేస్తున్నాయి. నిర్లక్ష్యంగా వ్యవహరించేలా చేస్తున్నాయి. డ్రగ్స్ వినియోగం కూడా పెరిగిపోతోంది. ప్రమాద హెచ్చరికలు వినవస్తున్నాయి. అధికార్లు నిస్సహాయతతో కాల్ సెంటర్లలో హెచ్ఐవీ టెస్టింగ్ కేంద్రాలను పెడుతున్నారు.



ఒక్క ముక్కలో చెప్పాలంటే, బీపీఓ ల సిబ్బందే కాదు సమాజంలోని స్కూలు పిల్లలు, వివాహమైనవారు అందరూ కూడా దిన దినం వారు చూస్తున్న సెక్స్ ప్రేరేపిత సంఘటనలకు వశులై మంచీ చెడూ తెలుసుకోలేక ఏది కావాలంటే అది సెక్స్ పరంగా చేసేస్తున్నారు. మ్యారేజ్ అన్న పదానికున్న విలువను తగ్గించేస్తూ ఓపెన్ మ్యారేజ్ పద్ధతి వచ్చేసింది. ఇది వివాహ బంధాలను, కుటుంబ సాంప్రదాయాలను బలహీన పరిచేసిందంటున్నారు సైకాలజిస్టులు. అభివృద్ధి అన్ని రంగాలలో వలెనే సెక్స్ లో కూడా చోటు చేసుకుంటోంది. మంచి గాను, చెడు గాను కూడా సంఘటనలు జరుగుతున్నాయి. అయితే, చివరకు కావలసింది భద్రత, సంక్షేమం అన్న విషయాలను అవగాహన చేసుకొని కొనసాగటం శ్రేయస్కరంగా మానసిక నిపుణులు సలహాల నిస్తున్నారు.

# విజ్ఞాన వాస్తు

1. యజమాని తలను తాకుతూ ప్రశ్నిస్తే, వాస్తు పురుషుని తల భాగంలో 8 తాళముల లోతులో (తాళం అనగా 12 అంగుళాలకు సమానం) హేమ శల్యాలుంటాయి.
2. ముక్కును తాకుతూ ప్రశ్నిస్తే వాస్తు పురుషుని ముక్కు ఉన్న ప్రదేశంలో 7 తాళముల లోతున చందనపు కట్టె ఉంటుంది.
3. కంఠాన్ని తాకుతూ ప్రశ్నిస్తే, వాస్తు పురుషుని కంఠ స్థానంలో 6 తాళముల లోతున ఏనుగు ఎముకలుంటాయి.
4. తొడలను తాకుతూ ప్రశ్నిస్తే, వాస్తు పురుషుని తొడల స్థానంలో ఐదు తాళముల లోతున వెండి కడ్డీ ఉంటుంది.
5. బొడ్డును తాకుతూ ప్రశ్నిస్తే, వాస్తు పురుషుని నాభి స్థానంలో నాలుగు తాళముల లోతున కంచు కడ్డీ ఉం టుంది.
6. యజమాని గుహ్య స్థానాన్ని తాకుతూ ప్రశ్నిస్తే వాస్తు పురుషుని గుహ్య స్థానంలో మూడు తాళముల లోతులో రాగి ముక్కలుంటాయి.
7. యజమాని మోకాళ్లను స్థానాన్ని తాకుతూ ప్రశ్నిస్తే వాస్తు పురుషుని మోకాళ్ల స్థానంలో హస్త ప్రమాణం (18 అంగుళాలు) లోతులో ఇనుప ముక్కలుంటాయి.
8. యజమాని చీల మండల స్థానాన్ని తాకుతూ ప్రశ్నిస్తే వాస్తు పురుషుని చీల మండల స్థానంలో హస్త ప్రమాణంలో సీసపు ముక్కలుంటాయి.
9. చేతులను తాకుతూ ప్రశ్నిస్తే, వాస్తు పురుషుని చేతులున్న స్థానంలో పాము ఎముకలు ఉంటాయి.
10. పార్శ్వస్థానాన్ని తాకుతూ ప్రశ్నిస్తే, వాస్తు పురుషుని ఆ స్థానంలో హస్త ప్రమాణంలో మేక ఎముకలుం టాయి.

**సంఘటనల ద్వారా శల్యాలను తెలుసుకునే పద్ధతి**

1. ఏదైనా గృహంలో మూడేళ్లకు ఒకసారి మరణాలు సం భవిస్తే, ఆ ఇంటిలో తూర్పు దిశలో మనిషికి సంబం ధించిన ఎముకలుంటాయి.
2. ఇంటిలో నివశించే వారికి తరచుగా అధికారుల భయం కాని, జైలుకు వెళ్లడం కాని జరుగుతుంటే, ఆ ఇంటి ఆగ్నేయ దిశలో గాడిద ఎముకలు తప్పకుండా ఉంటాయి.
3. ఇంటి యజమాని ఎప్పుడు దీర్ఘవ్యాధితో బాధపడుతూ ఉంటే ఈఇంటిలో దక్షిణ దిశలో దోషాన్ని కలిగించే శల్యాలు ఉంటాయి.
4. ఏ ఇంటిలోనైనా జన్మించిన శిశువులు మరణిస్తుంటే, ఆ ఇంటికి నైరుతి దిశలో కుక్క ఎముకలుంటాయి.
5. యజమానికి చిత్త వాంచల్యం కలిగి, మూడేళ్లు దేశ భ్రమణం చేసినట్లయితే, ఆ ఇంటిలో పశ్చిమ దిక్కులో శిశు శల్యాలుంటాయి.
6. ఇంటి యజమాని 12 ఏళ్ల నుంచి శత్రు భయాన్ని అనుభవిస్తుంటే ఆ ఇంటి వాయువ్య దిశలో ఊక లేదా బొగ్గులు ఉంటాయి.
7. అధికంగా పశువులు మరణించే ఇంటిలో ఈశాన్య ప్రదేశంలోగాని, పశువుల శాలలోని ఈశాన్య ప్రదేశంలోగాని పశు శల్యాలుంటాయి.
8. ఇల్లు కట్టే సమయానికి ఇంటి యజమాని ధనవంతుడిగా ఉండి, ఇల్లు కట్టిన తర్వాత 12 ఏళ్లలో ధనం క్రమంగా పోగొట్టుకుంటే ఆ యింటిలో ఉత్తర దిక్కులో మనిషికి సంబంధించిన ఎముకలుంటాయి.
9. ఇల్లు కట్టే సమయానికి గృహస్థునికి సంతానం ఉండి, గృహ ప్రవేశమైన తర్వాత, సంతాన నష్టం, వంశవృద్ధి లేకపోతే, ఈ యింటి మధ్యభాగంలో శల్యాలుగాని, బూడిద గాని ఇనుప ముక్కలుగాని ఉంటాయి.
10. ఇంటి యజమానికి పశువులు అధికంగా ఉండి, వాటికి పాలు లేకపోతే, ఆ ఇంటికి తూర్పు దిశలో గాని, పశుశాలకు తూర్పు దిశలో గాని శిశు శల్యాలుంటాయి.
11. ఇంటిలోని వారు ఒకరితో ఒకరు తగవు పడుతూ ఉంటే, ఆ ఇంటి మధ్యలో శిరస్సుకు సంబంధించిన శల్యం గాని కపాలం గాని ఉంటుంది.
12. గృహం నిర్మించే సమయానికి యజమాని ఆరోగ్యంగా ఉండి, ఇల్లు కట్టిన తర్వాత ఆరోగ్యం క్షీణిస్తే, ఇంటికి తూర్పు దిశలో కాలి ఎముకలుంటాయి.
13. గృహారంభ సమయంలో గృహస్థుడికి ఏ అవయవంలో దురద కలుగుతుందో వాస్తు పురుషుని యొక్క ఆ అవయవ స్థానంలో శల్యాలుంటాయని విశ్వకర్మ తెలిపింది.

ప్రశ్న సమయంలో గృహస్థులు ఏ అవయవాన్ని తాకుతాడో దాన్ని అనుసరించి కూడా శల్యస్థానాన్ని గుర్తించాలి. గృహారంభ కాలంలో యజమాని తన శిరస్సును తాకితే, వాస్తు పురుషుని శిరస్సు స్థానంలో 8 తాళముల లోతున శల్యాలుంటాయి. నాసిక స్థానంలో దురద కలిగితే, వాస్తు పురుషుని నాసికా ప్రదేశంలో శల్యాలుంటాయి. ముఖం మీద దురద కలిగితే, మూడు హస్తాల లోతులో ముత్యాలుంటాయి. ఒక చేతిని ఇంకో చేతితో గోకుకున్నట్లయితే, వాస్తు పురుషుని ఆ చేయి స్థానంలో గుర్రపు దంతాలుంటాయి.

**నక్షత్రం అనుసరించి, శల్య పరీక్ష**

ప్రశ్నసమయంలో యజమాని ఛాయను కొలిచి, తత్కాల లగ్న సంఖ్య, మరియు 28 కలిపితే, వచ్చే సంఖ్యను 13చే గుణించి, 16 చే భాగించగా శేషం అయితే కపాలం, 2 అయితే ఎముకలు, 3 అయితే ఇటుకలు, 4 అయితే కుండ పెంకులు, 5 అయితే కర్ర అవశేషాలు, 6 అయితే విగ్రహం, 7 అయితే బూడిద, 8 అయితే బొగ్గులు, 9 అయితే మృత కళేబరం, 10 అయితే శిలాజాలు, 11 అయితే ధనం, 12 అయితే రాళ్లు, 13 అయితే కప్పలు, 14 యఅఇతే కొమ్ములు, 15 అయితే కుక్క కళేబరం, 16 అయితే వెంట్రుకలు ఉంటాయి.

## జాతకం

పేరు: చిమ్మా శ్రీనివాస్
పుట్టినతేది: 29-04-70 (బుధవారం)
సమయం: మధ్యాహ్నం 1.20 ని॥
జన్మస్థలం: చిక్కవరం గ్రామం, గన్నవరం మండలం, కృష్ణా జిల్లా
ప్రశ్న: ఇప్పటివరకు ఏ పని చేసినా కలిసిరావ డం లేదు. దయచేసి పరిష్కార మార్గం చూపండి.

మీకు 2010 దాకా గురుదశ నడిచింది. మీ లగ్నానికి అది బాధక దశ. అందువల్ల మీరేం చేసినా కలిసి రాలే దనిపిస్తున్నది. అలాగే ఇప్పుడు అనగా 2013 దాకా మీరు ఏ కొత్త పని తలపెట్టినా కొన్ని సమస్యలు రావచ్చు. అయితే కొన్ని పరిష్కారాలు పాటిస్తే కొంత ఉపశమనం ఉంటుంది. ఈ క్రింది పరిహారాలను తప్ప కుండా పాటించండి.

★ మీకు ఈశాన్యం పనికిరాదు.
★ కనకపుష్యరాగం ధరించకూడదు.
★ ప్రతి గురువారం దేవాలయ సందర్శన చేయండి.
★ వీలైతే వజ్రం (డైమండ్) ధరించండి.
★ శనికి శాంతి చేయించగలరు.
★ 2013 జూలై తరువాత చాలా బాగున్నది.

★★★

శ్రీయుత గౌరవనీయులైన ఈద్పుగంటి పద్మజా రాణి గారికి నమస్కారములు. నాపేరు బొడ్డు పల్లి క్రాంతికుమార్. జన్మస్థలం పెద్ద పల్లి, కరీంనగర్ జిల్లా. నేను 2003-05 లో ఇంటర్ (బైపీసీ) ఉత్తీర్ణుడనయ్యాను. తదుపరి డిగ్రీలో చేరాను కాని మధ్యలోనే ఆపివేయడం జరి గింది. ప్రస్తుతం నేను నిరు ద్యోగిని. కానీ నాకు పై చదువులు చదవాలని ఉన్నది. దేశా నికి ఏదోవిధంగా ఉపయోగపడాలని ఉన్నది. నేను పై చదువులు చదువుతా నా? నాకు ఉద్యోగం దొరకుతుందా? నాకు ఏలినాటి శని ఏమైనా ఉందా? ఇప్పుడు నేను ఏం చేయా లి? దయచేసి సరైన సలహా ఇవ్వండి.

మీరు ఇచ్చిన వివరాలు సరైనవి అయినట్లయి తే... ఇప్పుడు మీకు నడిచే దశలు బాగానే ఉన్నాయి. ఈ నెల నుంచి (2012 మే) బాగుంటుంది. కొన్ని పరిహారాలు పాటించండి.

★ ఆగ్నేయ దోషం లేని ఇల్లు మంచిది.
★ 'శ్రీ రాజమాతంగ్యైనమః' అని రోజు 108 సార్లు పఠించండి.
★ డైమండ్ వుంటే తీసెయ్యండి.
★ ప్రతిరోజు సూర్య నమస్కారాలు చేస్తూ, ఆదిత్య హృదయం పారాయణ చేయడం చాలామంచిది.



★★★

పేరు: పైడా నాగభాగ్యలక్ష్మీ, పుట్టినతేది: 11-06-90
సమయం: మధ్యాహ్నం 3-03 ని॥
జన్మస్థలం: బాపట్ల మండలం, గుంటూరు జిల్లా

ఈ క్రింది పరిహారాలు పాటించండి అంతా శుభమే జరుగుతుంది.

★ నిత్యం సూర్య నమస్కారాలు చేయాలి.
★ ఇంద్రనీలం (1 కేరెట్) కుడిచేతి మధ్యవేలికి ధరించండి. ★ మీకు తూర్పు దిశ పనికిరాదు.
★ ప్రతి ఆదివారం నవగ్రహ దేవాలయాన్ని సందర్శించండి.

★★★

నా పేరు కాళహస్తి శేషగిరిరావు, పుట్టినతేది: 30-04-64, సమయం: ఉదయం 4-55, 5 గంటల మధ్యలో. జన్మస్థలం: నెల్లూరు.

నా పుట్టినతేది ప్రకారం నాది ఏ నక్షత్రం? ఏ రాశి? నాకు ఉద్యోగాభివృద్ధి ఉన్నదా? ఆర్థిక నష్టాలు ఎక్కువగా ఉన్నాయి. దయచేసి పరిష్కా రం తెలుపండి.

మీది జ్యేష్ఠ నక్షత్రం, 2వ పాదం, వృశ్చికరాశి. అయితే ప్రస్తుతం మీకు ఏలినాటి శని దశ నడుస్తున్నది. 2011లో మొదలైన ఈ దశ 2018 దాకా ఉన్నది. ఈ సమయంలో మీకు వృత్తిపరమైన అభివృద్ధి 2012 మే తరువాత తప్పకుండా ఉన్నది. ఈ క్రింది పరిహారాలు పాటించండి.

★ ప్రతి శనివారం నవగ్రహదేవాలయానికి వెళ్లండి (19 శనివారాలు).
★ మీకు పడమర ముఖద్వారం పనికిరాదు.
★ నీలం, నవరత్నాలు ధరించివుంటే వెంటనే తీసెయ్యండి.
★ రూబీ - కుడిచేతి ఉంగరం వేలికి ధరించండి. ★ 'లింగాష్టకం' పఠించండి.

★★★

పేరు: అంగరి రాజ్‌కుమార్
పుట్టినతేది: 12-06-73
సమయం: సాయంత్రం 5-35 ని॥లకు
జన్మస్థలం: మెట్‌పల్లి, కరీంనగర్ జిల్లా
చదువు: ఎం.ఏ (తెలుగు), టి.పి.టి, తెలుగు పండిట్

గవర్నమెంట్ ఉద్యోగానికి అవకాశాలు కొంచెం తక్కువ వున్నా కూడా మీరు పుణ్యబలం పెంచుకొని ఆ దిశగా ప్రయత్నించగలరు. అయితే ఈ క్రింది ముఖ్యమైన పరిహారాలు మాత్రం తప్పనిసరిగా పాటించాలి.

★ కెంపు ధరించండి.
★ ఏలినాటి శని ప్రభావం వల్ల ఇబ్బంది లేకుండా శని, గురు జపం చేయడం అవసరం.

## నేను పై చదువులు చదువుతానా?

మీ సందేహాలని క్లుప్తంగా (మనిషికి 1 ప్రశ్న మాత్రమే) ఈ క్రింది వివరాలు వ్రాసి పంపండి. (పుట్టిన తేదీ వివరాలు లేనివారు 108 లోగా ఒక సంఖ్య వ్రాసి పంపండి. ఇది ప్రశ్న పద్ధతి, మనిషికి ఒక్క ప్రశ్న మాత్రమే)

పేరు : ..................................
పుట్టిన తేదీ : ..................................
పుట్టిన సమయం : ..............................
పుట్టిన ఊరు (మండలం) : ..................
ప్రశ్న : ..................................

పై వివరాలతో కూడిన లెటర్‌ను ఈ క్రింది అడ్రస్‌కు పంపండి...

'జాతకం' 'సూర్య' ఆదివారం

SPR publications, Surya Soudha,
Plot.No: 185, M.C.H. NO.258/1/185,
siddi vinayaka nagar,
AyyappaSociety Opp: Hi-Tech City,
Hyderabad - 500 072.

## 30-10-2016 నుండి 5-11-2016 రాశిఫలం



మేషం: Aries ( అశ్విని, భరణి, కృత్తిక - 1) వ్యాపారా భివృద్ధి జరుగును. సంఘములో పలుకుబడి పెరుగుతుంది. ఉద్యోగస్తులకు ప్రమోషన్లు, కోరుకున్న చోటుకు బదిలీలు జరుగును. రాజకీయ రంగంలోని వారికి విశేషాభివృద్ధి కలుగును. విద్యార్థులకు ఉన్నత విద్యనభ్యసించే అవకాశం కలుగుతుంది. ఆది, సోమ, మంగళ, బుధ, గురువారములు అనుకూలిస్తాయి.



వృషభం: Taurus (కృత్తిక - 2,3,4, రోహిణి, మృగశిర - 1,2): రాజకీయ రంగాల వారికి బాగుండును. బంధువుల సహకారం లభించును. చెడ్డవారితో చెలిమి వలన కొన్ని సమస్యలు వస్తాయి. నూతన వ్యాపారములు మొదలు పెట్టెదరు. విద్యార్థులు రాణింతురు. ఉద్యోగస్తులకు బదిలీలు జరుగును. అర్థాష్టమ శనిగలదు. శ్రీ విష్ణువును పూజించుట మంచిది.



మిథునం: Gemini (మృగశిర -3,4 ,3,4, ఆరుద్ర, పునర్వసు-1,2,3)ఊహించని సంఘటనలు జరుగును. ఉద్యోగస్తులకు అధికారుల వేధింపులు ఉండును. నూతన స్థలములందు వృత్తి, వ్యాపారములు చేస్తారు. ప్రభుత్వ రవాణా, విద్యుత్ శాఖ లందు పనిచేయువారికి బాగుండును. దానధర్మాలు చేయుదురు. క్లబ్బులు, లాటరీ రంగాలవారికి లాభించును.



కర్కాటకం: Cancer(పునర్వసు -4,స్థల వ్యాపారస్తులు ప్రత్యర్థుల కన్నా ముందుండి లాభాలు సంపాదిస్తారు. నిరుద్యోగులు, విద్యార్థులు పోటీ పరీక్షల్లో విజయం సాధిస్తారు. ఆరోగ్య విష యంలో ప్రత్యేక శ్రద్ధ అవసరం. కోర్టు సమస్యల నుండి విముక్తి లభిస్తుంది.కుటుంబ వ్యవహారాల్లో ఇతరులు జోక్యం చేసుకుంటారు.



సింహం: Leo (ముఖ, పుబ్బ, ఉత్తర -1):గృహోపకరణములు కొంటారు. పలుకుబడి సంపాదించుటకు గట్టి కృషి చేయుదురు. ప్రకటన, విద్యా రంగాల వారికి అనుకూలంగా ఉండును. విద్యార్థులు కష్టపడి చదవాలి. ముఖ్య విషయములందు నిర్ణయములు వాయిదా వేయడం మంచిది. ఏల్నాటి శని గలదు. శ్రీ విష్ణువును, వెంకటేశ్వరుని పూజించుట మంచిది. ఆది, సోమ, మంగళ వారాలు అనుకూలంగా ఉండును.



కన్య: Virgo ( ఉత్తర - 2,3,4, హస్త, చిత్త -1,2)::విద్యార్థులకు మంచి అభివృద్ధి కలుగును. రాజకీయ, సినీ, నాటక, ఇతర కళా రంగాల వారికి బాగుండును. అనుకున్న పనులు శ్రమ మీద జరుగును. పుణ్యక్షేత్రాలు సందర్శిస్తారు. ఆర్థికపరిస్థితి బాగుండును. శత్రువులను జయింతురు. వివాహాది శుభకార్యాలు జరుగును. బాకీలు వసూలు అగును. రైతులకు లాభదాయకం..



తుల: Libra (చిత్త -3,4, స్వాతి, విశాఖ -1,2,3) రాజకీయ నాయకులకు పలుకుబడి పెరుగును. ఉద్యోగస్తులకు బదిలీలు, ప్రమోషన్లు లభించును. తలపెట్టిన పనులు సుఖాంతమవుతాయి. చేతి పనుల వారికి విశేష ధనలాభం కలుగును. గనులు, భూమి, రియల్ ఎస్టేట్ వ్యాపారులకు లాభించును. శుక్ర, శనివారములు అనుకూలించును.



వృశ్చికం: Scorpio (విశాఖ -4 అనూరాధ, జ్యేష్ఠ) రాజకీయ నాయకులకు బాగుండును. ధైర్యముగా, సాహసంగా ఉందురు. కొత్త స్నేహితులు పరిచయమవుతారు. గూఢాచారులకు బాగుండును. వివాహాది శుభకార్యములు జరుగును. పనులు, బాధ్యతలు సకాలంలో నేరవేర్చుదురు. మంగళ, బుధ వారాలు అనుకూలం. కార్మికులకు, చేతి పనివారికి ధనలాభం కలుగును.



ధనుస్సు: Sagittarius (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ -1):వృత్తి వ్యాపారస్తులకు విశేష ధనలాభం కలుగును. వాహన లాభాలు కలుగును. నూతన గృహనిర్మాణం చేయుదురు. విద్యార్థులకు ఉన్నత విద్యనభ్యసించే అవకాశం వస్తుంది. పాపభీతి, దయ కలిగి యుందురు. దాన ధర్మాలు చేయుదురు. అందరి అభిమానం పొందుతారు. బుధ, గురువారాలు బాగుండును.



మకరం: Capricorn (ఉత్తరాషాఢ -2,3,4, శ్రవణం, ధనిష్ఠ -1,2) వృత్తి వ్యాపారములు సామాన్యంగా ఉండు ను. విద్యుశ్చక్తి, టెలిఫోను,నిర్మాణ రంగం వారికి బాగుం డును. స్వయం కృషి వలన లాభాలు కలుగును. ప్రయా ణాలు వచ్చును. స్నేహితులతో జాగ్రత్తగా వ్యవహరిం చవలెను. ఆర్థిక ఇబ్బందికలిగిననూ, సకాలములో ధనం లభించును. అనాలోచిత ప్రయాణములు చేస్తారు. అష్టమ శని గలదు. శ్రీ విష్ణువును ,శ్రీవెంకటేశ్వరుని పూజించాలి. అపవాదులు, అపోహలు కలుగును.



కుంభం: Aquarius (ధనిష్ఠ-3,4, శతభిష, పూర్వాభాద్ర- 1,2,3) ఆరోగ్యము బాగుండును. స్త్రీ స్నేహం లభించును. వ్యవసాయ దారులకు స్వల్ప లాభం. వృత్తి, పాల, ఉత్పత్తుల, వస్త్ర వ్యాపారులకు లాభించును. బంధుమిత్రులతో కలహాలు వచ్చును. అధిక ధన వ్యయం కలుగును. అనవసర ప్రయాణాలు వచ్చును. శ్రీ సుబ్రమణ్యేశ్వరుని ఆరాధించుట మంచిది.



మీనం: Pisces (పూర్వాభాద్ర -4
ఈ రాశి అన్ని రంగాల వారికి అనుకూలంగా ఉండును. విశేష ధనలాభం కలుగును. శుభకార్యాలు జరుగుతాయి. గ్రామాధికారం సిద్ధించును. ఆది, సోమ, మంగళ వారాలు అనుకూలము.



స్వర్గాన్ని నరకంగా చేసేది- నరకాన్ని స్వర్గంగా చేసేది మనస్సే. -మిల్టన్

## ఆలయం

హిందూమత సాహిత్యం ప్రకారం, చిదంబరం అనేది శివుని ఐదు పవిత్రమైన ఆలయాల్లో ఒకటి. పంచ భూతాలకి ఒక్కొక్క ఆలయం నిర్మించబడం ది. చిదంబరం ఆకాశతత్వానికీ,తిరువనైకవల్ జంబుకేశ్వర జలతత్వానికీ, కంచి ఏకాంబరేశ్వర భూమితత్వానికీ, తిరువణ్ణామలై అరుణాచలేశ్వర అగ్నితత్వానికీ మరియు కాళహస్తీశ్వర స్వామి వాయుతత్వానికీ నిదర్శనాలు.

ఈ ఆలయాల సముదాయం నగరం నడిబొడ్డున వ్యాపిం చి ఉంది. శైవుల మరియు వైష్ణవుల దేవతలు కొలువున్న అతికొద్ది దేవాలయాల్లో ఈ ఆలయం

భారతదేశంలోని దక్షిణ రాష్ట్రమైన తమిళనాడు మధ్యస్థ తూర్పు భాగంలోని, కడలూర్ జిల్లాలోని కారైకల్కు ఉత్తరంగా 60 కిలోమీటర్ల దూరంలో, పాండిచ్చేరికి దక్షిణంగా 78 కిలో మీటర్ల దూరంలో ఉన్న ఆలయ నగరమైన చిదంబరం నడిబొడ్డున ఈ ఆలయం నెలకొని ఉంది. తమిళ సంగం సాహిత్య రచనల ప్రకారం, సనాతన విశ్వకర్మల వంశస్థుడైన విదువేల్విడుగు పెరుమ్త కన్, ఈ ఆలయం వునః సృష్టికి ప్రధానరూపశిల్పి.



# మోక్షాన్ని ప్రసాదించే నటరాజస్వామి

ఒకటి. నటరాజు అయిన శివుడుకి, గోవిందరాజ పెరుమాళ్ళుకి అంకితమైన ప్రాచీన మరియు చారిత్రాత్మక దేవాలయం ఇది. ఏ విధంగా కోవెల (గుడి) అంటే వైష్ణవులకు, శ్రీరంగం లేదా తిరువరంగం స్మరణకి వస్తుందో అదే విధంగా శైవులకి చిదంబర ఆలయమే స్మరణకి వస్తుంది.



### గోపురం మీద చిక్కని శిల్పకళ.

చిదంబరం అను పదం, చైతన్యం అని అర్థం వచ్చిన చిత్, ఆకాశం(ఆకాయం నుంచి పుట్టిన) అని అర్థం వచ్చిన అంబ రం, సూచించిన చిదాకశం, చైతన్యం ఆరోపించబడినట్టి ఆకాశం, దీనినే అన్ని వేదాలు మరియు శాసనాల ప్రకారం, మానవుడు చేరుకోవలసిన అంతిమ లక్ష్యంగా చెప్పబడి నది. మరొక సిద్ధాంతం ఏమనగా, ఇది చిత్ + అంబళం నుంచి పుట్టినది. అంబళం అనగా కళలను ప్రదర్శించుట కొరకు ఒక వేదిక. చిదాకశం అనేది పరమేశ్వరుని చిద్విలాసం లేదా ఆనందం నటరాజుని చిద్విలాసం లేదా ఆనంద నటన చిహ్నాత్మక వర్ణన. చిదంబరాన్ని దర్శిస్తే విముక్తి లభిస్తుందని శైవులు నమ్ముతారు. ఇంకా మరొక సిద్ధాంతం ప్రకారం, ఆట లేక దైవ నృత్యం అని అర్థం వచ్చే చితు, వేదిక అని అర్థం వచ్చే అంబళం నుంచి వచ్చిన చిత్రాంబళం నుంచి ఈ పదం పుట్టింది.

సర్వాలంకృతభూషితుడైన నటరాజుని చిత్రం, ఈ ఆల యం ప్రత్యేకత. పరమ శివు, భరతనాట్య నృత్యం దైవంగా వర్ణించింది.

శివుడికి శాస్త్రీయ రూపమైన లింగానికి భిన్నంగా మనుష్య రూపాన్ని ఆరోపించిన మూర్తితో శివుడిని నెలకొల్పిన అతికొద్ది దేవాలయాల్లో ఇది ఒకటి. పరమ శివుడు నిలుపునట్టి ఈ విశ్వం యొక్క కదలికలు, నటరాజు యొక్క జగత్సంబంధమైన నృత్యాన్ని పోలి ఉంటుంది. ఆలయంలో ఐదు ఆవరణలు ఉన్నాయి.

అరగాలూరు ఉదయ ఇరరతెవన్ పొంపరప్పినన్ (అలి యాస్ వనకోవరైయన్) 1213లో చిదంబరంలోని శివుని ఆలయాన్ని పునర్నిర్మించాడు. అదే బాణ సామ్రాజ్య ప్రము ఖుడు తిరువన్నమలై ఆలయాన్ని కూడా నిర్మించాడు.

ఈ ఆలయాన్ని సనాతనంగా నడిపిస్తున్న దిక్షితార్ అని పిలువబడే, అంతర్వివాహీకులైన శైవ బ్రాహ్మణులు, అధికారిక పురోహితులు కూడా. దీక్షితార్లకి, తమిళనాడు ప్రభుత్వానికీ మధ్య జరిగిన దీర్ఘకాలిక యుద్ధానికి ఇది చరమాంకం. ప్రభుత్వం దీక్షితార్లు కానివారిని తేవరం స్తోత్రాలను దేవుని యొక్క 'గర్భగుడి'లో (సంస్కృతం: గర్భ గ్రిహ) గానం చేయుటకు అనుమతించినప్పుడు, దీక్షితులు, వారికి మాత్రమే నటరాజుని గర్భగుడిలో పూజించే హక్కు కలదని తెలియజెప్పి అభ్యంతరం చెప్పుటతో మొదలైనది.

# సాధనలో నియమాలు అవసరమా?

**నియమం లేని సాధన వికృత శక్తిని జనింపచేస్తుంది, నియమాలతో కూడుకున్న సాధన మార్గం మనిషిని ఉత్తమస్థితులకు తీసుకువెళుతుంది. ఈ మధ్య కాలంలో ఆధ్యాత్మికతను సులభతరం చేయాలనే ప్రయత్నంలో జనాకర్షణ కోసం గురువులుగా చెప్పుకొనే కొందరు ఎటువంటి నియమనిబంధనలు లేని కొన్ని ఆధ్యాత్మిక విధానాలను ప్రవేశపెడుతున్నారు. అవి ఎంత సులభతరమో వాటి ఫలితాలు కూడా అంత ప్రమాద కరంగా మారే అవకాశం వుంది.**

సాధనా మార్గం సులభతరంగా వుండటం తప్పులేదు, కానీ సాధకుని భావజాలం కూడా సులభతరం వైపే మొగ్గుచూపితే కష్టించి పనిచేసి సంపాదించకుండా దొంగదారిలో సంపాదించాలనే వాడి బుద్ధిలా మారిపోతుంది. సాధనతో వచ్చే శక్తితో పాటు వ్యక్తి యొక్క నిర్మాణం కూడా జరగాల్సి వుంటుంది. వ్యక్తిగా ఉన్నతమైన భావ జాలము ఆచరణ లేని సాధన యొక్క శక్తి మనిషిని అయో మయంలో పడేస్తుంది. పూర్వం ఒక గురువుదగ్గర శిష్యు డిగా చేరడానికే ఎన్నో నియమాలు పెట్టేవారు, ఆ



నియమాలలో శిష్యుడిగా చేరాలనుకునే వాడు నెగ్గితేనే శిష్యరికం ఇచ్చేవారు. లేదంటే ఆ కనీస అర్హత వచ్చే వరకు ఆ వ్యక్తి మాళ్ళీ మళ్ళీ ప్రయత్నం చేయాల్సిందే.

ఇవన్నీ నాస్తికులకు,కుహనావాదులకు తప్పులుగా తోచవచ్చు కానీ అవన్నీ లేకపోతే

సమాజం ప్రమాదాల వడిలోకి పోవాల్సివస్తుంది. టెక్నాలజీ అనేది దేశ ప్రగతికి దోహదపడుతుందటే, మరో పక్కన అదే టెక్నాలజీ ఉగ్రవాదులకు విధ్వంస కాండ కోసం ఉపయోగపడుతోంది. సాధన చేస్తే ఎవరి కైనా శక్తి ఉత్పన్నమవుతుంది, కానీ ఆ సాధన చేసిన వాడి వ్యక్తిత్వ నిర్మాణము సరిగా లేకపోతే అది రాక్ష సత్వంగా,వ్యక్తిగా ఉన్నతంగా వున్నవాడి సాధనా శక్తి దివ్యంగా ప్రవర్తిస్తుంది. అందుకు మంచి ఉదాహరణ రాముడు, రావణాసురుడు. రామాయణంలో చెప్పిన ప్రకారం రావణాసురుడు తపో సంపన్నుడు. అతని తపస్సువల్ల అనితరసాధ్యమైన ఎన్నో శక్తులు ఆయన సొంతం చేసుకోగలిగాడు. అయితే నేం రాముడి సర్వోన్నతమైన వ్యక్తిత్వం ముందు, ఆ దివ్యత్వం ముందు మోకరిల్లాల్సి వచ్చింది. రావణాసురుడిలో శక్తి వక్రమార్గాలను వెతుకుతుంది, రాముడిలోని శక్తి లోకానికి దారి చూపింది. ఒక సాధన ద్వారా శక్తి జనిస్తుంది అంటే అక్కడ నియమమనేది తప్పనిసరి వుండి తీరాలి, నియమం లేకుండా సాధన చేస్తాము అంటే దాని కోరల్లో ఏదోక రోజు చిక్కుకోవడం ఖాయం. ఈ మధ్యకాలంలో ఎన్నో ఆధ్యాత్మిక సంస్థలు పుట్టుకొచ్చాయి. (జనాల బద్ధకాన్ని ఆసరాగా చేసుకుని వారి బద్ధకానికి అనుగుణంగా ఆధ్యాత్మిక విధానాలను రూపొందించి, వారికి సాధానా మార్గాలుగా చెబుతున్నారు. అవి బద్ధకస్తులకు అనుకూలంగా వుండటంతో వారుకూడా వాటికి ఆకర్షితులై ఆహా ఓహో అంటూ బుట్టలో పడుతున్నారు. వెస్ట్రన్ కల్చర్‌కి అలవాటుపడిన కొందరు వాటిని పరమాద్భుతమైన సాధనలుగా ప్రాచారం




చేస్తున్నారు. అలా నియమాలు లేని సాధన మంచే చేస్తుందంటే సకల వాంగ్మయాన్ని అందించిన వేదవ్యాసుడు మనకు చెప్పలేకపో యాడా?. హిందూ ధర్మాన్ని అవహేళన చేస్తూ జనాల్లో అపోహలను సృష్టించి మనవారు కొట్టుకునేలా చేసిన కొన్ని కొత్తమతాలను పారిపోయేలా చేసిన ఆదిశంకరులు చెప్పలేకపోయారా?

ఒక్కసారి బుద్ధిపెట్టి ఆలోచిస్తే సాధనా మార్గంలో నియమాలు ఎంత

ముఖ్యమైన పాత్రను పోషిస్తాయో తెలిసివస్తుంది.

ఆధ్యాత్మిక సాధనకంటే ముందు సాధనలోకి అడుగు పెట్టాలనుకునే వాడికి క్రమశిక్షణ చాలా అవసరం. అది రోజువారి జీవితంలో మనం అలవాటు చేసుకోవాల్సిన విషయం. భోగలాలసత్వంతో సుఖాలవెంట పడి వాటినే ఆధ్యాత్మిక సాధనగా మార్చివేయగల ప్రబుద్ధులు భూమి పైన వున్నారు. సాంప్రదాయకంగా ఉత్తమంగా జీవించే వారిని చూసి అవహేళన చేసే రోజులు వచ్చేసాయి. ఆధ్యాత్మి కతలో కూడా విచ్చలవిడి తనపు సాధనా విధానాలు పుట్టుకొ చ్చాయి. నియమమే లేదనే సాధన వ్యర్థం. సాధకులు గమనించి మార్గాన్ని ఎంచుకోవాలి.



# పూల గుసగుసలు

పరిమళాలు వెదజల్లే పసిడికాంతి పువ్వులం
పదములల్లి పాడుకునే స్వరాలంటి పల్లవులం
బూరెలంటి బుగ్గలతో చిరునవ్వులు
వెదజల్లుతాం
కన్నెపిల్ల వాలుజడలో... చంద్రవంకలం...
సన్నజాజి సుగంధాల మందార మల్లెలం
నవ్వుకునే నలుగురికీ... ఆనందం పంచుతాం...






















www.mohanpublications.com

# మోహన్ పబ్లికేషన్స్‌లో లభించు
# పుస్తకముల పట్టిక
(Book List)

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆయుర్వేద, మంత్రశాస్త్రాది
అనేక విషయాలు తెలుసుకోండి...

ఫేస్‌బుక్ **మోహన్ పబ్లికేషన్స్** పేజ్ లైక్ చేయండి.

Like us to follow :



**MOHAN PUBLICATIONS**
Rajamahendravaram



0883 - 246 2565
903 246 2565

MOHAN PUBLICATIONS

మోహన్ పబ్లికేషన్స్,

అజంతా హోటల్ ఎదుట, కోటగుమ్మం, రాజమహేంద్రవరం - 533101.

WWW.MOHANPUBLICATIONS.COM

## మావద్ద లభించు గ్రంథములు

### 1. వ్రతకథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ.10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీ వ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ది వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మి - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

| | | |
|---|---|---|
| 63. | కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. | కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. | హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. | గోమాత | 40-00 |

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు<br>పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం | 45-00 |
| 2. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, | 50-00 |
| 3. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, | 50-00 |
| 4. | స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) | 99-00 |
| 5. | లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి | 63-00 |
| 6. | స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ | 108-00 |
| 7. | సర్వదేవతా స్తోత్రమంజరి | 120-00 |
| 8. | సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 24-00 |
| 9. | విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 25-00 |
| 10. | లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) | 36-00 |
| 11. | లలితా సహస్రనామములు | 24-00 |
| 12. | లక్ష్మీ సహస్రనామములు | 24-00 |
| 13. | దుర్గా సహస్రనామములు | 24-00 |
| 14. | ఆంజనేయ సహస్రనామములు | 24-00 |
| 15. | శివ సహస్రనామములు | 24-00 |
| 16. | విష్ణు సహస్రనామములు | 24-00 |
| 17. | గణపతి సహస్రనామములు | 24-00 |
| 18. | సుబ్రహ్మణ్య సహస్రనామములు | 24-00 |
| 19. | గాయత్రి సహస్రనామములు | 24-00 |
| 20. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 24-00 |
| 21. | శ్రీరామా సహస్రనామములు | 24-00 |
| 22. | సరస్వతి సహస్రనామములు | 24-00 |
| 23. | సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం | 24-00 |
| 24. | శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | 24-00 |
| 25. | మణిద్వీపవర్ణన (పెద్దది) | 24-00 |
| 26. | సంధ్యావందనం | 24-00 |
| 27. | మంత్రపుష్పమ్ | .... |
| 28. | త్రిభాషా హనుమాన్‌చాలీసా | 15-00 |
| 29. | హనుమాన్ చాలీసా | 10-00 |

| | | |
|---|---|---|
| 30. | మణిద్వీపవర్ణన (పాకెట్) | 10-00 |
| 31. | ఆరు చాలీసాలు | 10-00 |
| 32. | శివారాధన (శివస్తోత్రాలు) | 10-00 |
| 33. | వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) | 10-00 |
| 34. | ఆరుదండకాలు | 5-00 |
| 35. | వేంకటేశ్వర గోవిందనామములు | 5-00 |
| 36. | అష్టలక్ష్మీ స్తోత్రమ్ కనకధారాస్తోత్రమ్ | 10-00 |
| 37. | దేవీఖడ్గమాలాస్తోత్రమ్ (మహిషాసురమర్దనీస్తోత్రంతో) | 10-00 |
| 38. | సుందరకాండ (పాకెట్) | 10-00 |
| 39. | భగవద్గీత మూలం | 27-00 |
| 40. | రామరక్షాస్తోత్రమ్ | 15-00 |
| 41. | స్తోత్ర రత్నావళి | 36-00 |
| 42. | పురాణపండ లలితా-విష్ణు సహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 43. | పురాణపండ లలితాసహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 44. | పురాణపండ విష్ణు సహస్రనామస్తోత్రమ్ | 10-00 |
| 45. | పురాణపండ ఆదిత్య హృదయం | 10-00 |
| 46. | మంత్రపుష్పం (మినీ) | 10-00 |
| 47. | శివానందలహరి-సౌందర్యలహరి | 36-00 |
| 48. | కుజదోషం | 10-00 |
| 49. | కాలసర్ప దోషం | 10-00 |
| 50. | మీ అప్పులు తీరాలా? | 10-00 |
| 51. | దృష్టిదోషాలు నివారణ | 10-00 |
| 52. | పంచసూక్తములు | 10-00 |
| 53. | సంధ్యావందనం | 10-00 |
| 54. | రుద్రనమకమ్-చమకమ్ | 10-00 |
| 55. | గాయత్రీమంత్రాలు | 10-00 |
| 56. | హయగ్రీవ స్తోత్రమాల | 10-00 |
| 57. | దక్షిణామూర్తి స్తోత్రమాల | 10-00 |
| 58. | ద్వాదశ జ్యోతిర్లింగాలు - పంచారామాలతో | 10-00 |
| 59. | శ్రీసూక్తం పురుష సూక్తం | 10-00 |
| 60. | నవగ్రహస్తోత్రమాల | 36-00 |
| 61. | మహాన్యాసమ్ | 36-00 |
| 62. | సుందరకాండ గానామృతం | 36-00 |
| 63. | గోమాతపూజావిధానము | 10-00 |
| 64. | ఆనందసిద్ధి - 1 శ్రీదేవీ స్తోత్రమాల | 108-00 |

